శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

# శ్రీదేశికస్తోత్రమాలా – 1

# శరణాగతిదీపికా

విళక్కొళి పెరుమాళ్, తిరుత్తణ్కా




'పండితరత్న'

డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అఴగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# శరణాగతిదీపికా

అవతారిక: దీనికి ఈ పేరును దేశికులే పెట్టారు. ఇందులో 59 శ్లోకాలున్నాయి. ఈ స్తోత్రం దేశికులు అవతరించిన చోటు అయిన తిరుత్తణ్కా అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే విళక్కొళి (దీపప్రకాశ) నామధేయుడైన స్వామిని ఉద్దేశించి రచింపబడింది. ఆ స్వామికి సంస్కృతంలో దీపప్రకాశుడని పేరు. ఇక్కడికి సమీపంలో వేగవతి అనే నది ప్రవహిస్తున్నది. ఇక్కడ లక్ష్మీసరస్సు అనే సరస్సు ఉన్నది. ఇందులోనుండి లక్ష్మి ఆవిర్భవించి, స్వామిని పరిణయమాడినట్లు స్థలపురాణం పల్కుతున్నది.

శ్రీరామానుజులకు అంతరంగశిష్యులై, వారివద్ద సర్వార్థాలను గ్రహించినవారు, మడప్పళ్ళి ఆచ్చాన్ అనే పేరును కలవారైన ఆత్రేయ రామానుజాచార్యులవారి సంప్రదాయమే ఈ స్తుతిగా అవతరించింది - అని అంటూ దేశికులు ఈ స్తుతిని ఆరంభించారు. ఇందులో లక్ష్మీదేవి అవతారం, భగవానుని సర్వాధికత్వం, ఆ స్వామికి కల షాడ్గుణ్యం, ఆచార్యపరంపరలో భగవానుని మొదటి స్థానం, అతని సర్వవిధబంధుత్వం, సౌశీల్యం, భక్తియోగప్రకారం, ప్రపత్తికి కల గొప్పతనం, దాని అయిదు అంగాలు, ఉత్తరకైంకర్యం, ప్రపన్నుడు శరీరంనుండి నిర్గమించే ప్రకారం, అర్చిరాదిమార్గం, ముక్తిలో జీవుడు పొందే భగవానునితో సామ్యం, ఇహలోకసుఖంలోని పలు దోషాలు - అనే పలు విషయాలను వివరించిచివరలో మోక్షాన్ని అనుగ్రహించమని భగవానుని అర్థించి, ఈ స్తోత్రం లోకంలోని అజ్ఞానాంధకారాన్ని అంతటినీ తీర్చగలదని పల్కి ఈ స్తుతిని దేశికులు ముగించారు.

# శరణాగతిదీపికా

1) *పద్మాపతేః స్తుతిపదేన విపచ్యమానం*
*పశ్యంత్విహ ప్రపదనప్రవణా మహాంతః।*
*మద్వాక్యసంవలితమప్యజహత్స్వభావ*
*మాన్యం యతీశ్వరమహానససంప్రదాయమ్॥*

శరణాగతిలో ఆసక్తిని కలవారైన పెద్దలు లక్ష్మీనాయకుడైన భగవానునిగూర్చిన స్తుతిగా అవతరించినదైన నా వాక్కులతో కలసి ఉన్నా తన గొప్పతనాన్ని కోల్పోనిదై, గౌరవింపబడదగినదైన ఈ స్తుతిలో శ్రీరామానుజులకు మహానసకైంకర్యాన్ని చేసిన ఆత్రేయ రామానుజులవారివల్ల వచ్చిన సంప్రదాయాన్ని గమనించగలరు.

2) *నిత్యం శ్రియా వసుధయా చ నిషేవ్యమాణం*
*నిర్వ్యాజనిర్భరదయాభరితం విభాతి।*
*వేదాంతవేద్యమిహ వేగవతీసమీపే*
*దీపప్రకాశ ఇతి దైవతమద్వితీయమ్॥*

లక్ష్మీదేవిచే, భూదేవిచే సదా సేవింపబడేదై, ఏ కారణం లేకుండానే సహజంగా ఉండే కరుణను పరిపూర్ణంగా కల్గినదై, వేదాంతాలవల్ల తెలియదగినదైన, దీపప్రకాశుడనే సాటి లేని పరదేవత ఇక్కడ వేగవతి నదికి సమీపంలో ప్రకాశిస్తున్నది.

3) *దీపస్త్వమేవ జగతాం దయితా రుచిస్తే*
*దీర్ఘం తమః ప్రతినివర్త్యమిదం యువాభ్యామ్।*
*స్తవ్యం స్తవప్రియమతః శరణోక్తివశ్యం*
*స్తోతుం భవంత మభిలష్యతి జంతురేషః॥*

స్వామీ! లోకానికి దీపం నీవే. ఆ దీపం వెలుగు నీ లక్ష్మీదేవియే. చిరకాలంగా ఉన్న ఈ అజ్ఞానాంధకారం మీ ఇద్దరిచేతనే తొలగింపబడాలి. అందువల్ల నేను, స్తుతింపదగినవాడవై, స్తుతికి సంతోషించేవాడవై, శరణమనే మాటకు వశమయేవాడవైన నిన్ను స్తుతించగోరుతున్నాను.

4) *పద్మాకరాదుపగతా పరిషస్వజే త్వాం*
*వేగాసరిద్విహరణా కలశాబ్ధికన్యా।*
*ఆహు స్తదా ప్రభృతి దీపసమావభాసమ్*
*ఆజానతో మరకతప్రతిమం వపుస్తే॥*

క్షీరాబ్ధిపుత్రిక అయిన లక్ష్మి తామరకొలనునుండి ఆవిర్భవించి వచ్చి, వేగవతీనదిలో క్రీడిస్తున్నదై, నిన్ను ఆలింగనం చేసికొన్నది, సహజంగానే మరకతమణివంటి నీ మేని అప్పటినుండి దీపంవలె ప్రకాశాన్ని కల్గినదని పెద్దలు పల్కుతున్నారు.

5) *స్వామిన్!గభీరసుభగం శ్రమహారి పుంసాం*
*మాధుర్యరమ్యమనఘం మణిభంగదృశ్యమ్।*
*వేగాంతరే వితనుతే ప్రతిబింబశోభాం*
*లక్ష్మీ సరః సరసిజాశ్రయమంగకం తే॥*

స్వామీ! గంభీరమై, సుందరమై, మానవుల తాపాన్ని తీర్చేద్దై, మధురంగా వెలిగేద్దై, దోషరహితమై, ఇంద్రనీలఖండంవలె చూడదగినద్దై, లక్ష్మికి నివాసస్థానమై ఉండే నీ తిరుమేని, లక్ష్మీసరస్సు -అనే ఈ రెండూ వేగవతీనది నడుమ ప్రతిబింబశోభను పొందుతున్నాయి.

*6) ఆవిశ్య ధారయసి విశ్వ మముష్య యంతా*
*శేషీ శ్రియఃపతి రశేషతనుర్నిదానమ్।*
*ఇత్యాదిలక్షణగణైః పురుషోత్తమం త్వాం*
*జానాతి యో జగతి సర్వవిదేష గీతః॥*

జగత్తులోపల ప్రవేశించి, దానిని ధరిస్తున్నావు. ఈ లోకాన్ని నియమించేవాడవై, స్వామివై, అన్నిటిని శరీరంగా కలవాడవై, లక్ష్మీనాయకుడవై, జగత్తుకు మూలకారణమై ఉన్నావు. ఇటువంటి లక్షణాలను కల నిన్ను ఎవడు పురుషోత్తమునిగా తెలిసికొంటున్నాడో, అతడు ఈ లోకంలో అన్నిటిని తెలిసినవాడుగా గీతలో చెప్పబడ్డాడు.

*7) విశ్వం శుభాశ్రయవదీశ!వపు స్త్వదీయం*
*సర్వా గిర స్త్వయి పతంతి తతోసి సర్వః।*
*సర్వే చ వేదవిధయః త్వదనుగ్రహార్థాః*
*సర్వాధిక స్త్వమితి తత్త్వవిద స్తదాహుః॥*

సర్వేశ్వరా ! నీ తిరుమేనివలె, ఈ లోకం అంతా నీకు శరీరమై ఉన్నది. వాక్కులన్నీ నీలోనే పర్యవసిస్తున్నాయి. ఈ విధంగా అన్ని రూపాలు, అన్ని నామాలు నీవే కనుక, నీవు అన్ని వస్తువులుగా ఉన్నావు. వేదాలన్నిటిలో

విధింపబడే కర్మలు అన్నీ నీ అనుగ్రహాన్ని పొందడంకోసం ఏర్పడినవే. అందువల్ల నీవు సర్వాధికుడవని యథార్థవిదులు పల్కుతున్నారు.

*8) జ్ఞానం బలం నియమనక్ష వీర్యం*
*శక్తిశ్చ తేజ ఇతి తే గుణషట్కమాద్యమ్।*
*సర్వాతిశాయిని హిమోపవనేశ !యస్మిన్*
*అంతర్గతో జగదివ త్వయి సద్గుణౌఘః॥*

దీపప్రకాశస్వామీ! జ్ఞానం, బలం ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు —అనే నీ ఆరు గుణాలు మొదటివి. (ప్రధానమైనవి) సర్వాధికుడవైన నీలో లోకం అంతా ఇమిడి ఉన్నట్లు, ఈ ఆరు గుణాలలో మిగిలిన గుణాలన్నీ అంతర్భవించి ఉన్నాయి.

*9) దీపప్రకాశ!దయయా విధిపూర్వమేతత్*
*విశ్వం విధాయ నిగమానపి దత్తవంతమ్।*
*శిష్యాయితాః శరణయంతి ముముక్షవ స్త్వామ్*
*ఆద్యం గురుం గురుపరంపరయాధిగమ్యమ్॥*

తిరుత్తణ్ కా అనే దివ్యదేశంలో ఉండే స్వామీ! దయతో బ్రహ్మను పురస్కరించుకొని ఈ ప్రపంచాన్ని సృష్టించి, వేదాలను ఉపదేశించావు. అందువల్ల ఆచార్యపరంపరలో ఒకడవై, సేవింపదగిన వాడవై. అందులో ముందుగా సేవింపదగిన వాడవయ్యావు. ఇటువంటి నీకు ముముక్షువులు శిష్యులై, నిన్ను శరణు పొందుతున్నారు.

*10) సత్తాస్థితిప్రయతనప్రముఖై రుపాత్తం*
*స్వార్థం సదైవ భవతా స్వయమేవ విశ్వమ్।*
*దీపప్రకాశ! తదిహ త్వదవాప్తయే త్వామ్*
*అవ్యాజసిద్ధ మనపాయ ముపాయమాహుః॥*

దీపప్రకాశస్వామి !జగత్తు నీ వల్లనే స్వరూపస్థితి ప్రవృత్తులు మొదలైనవానిని పొందుతున్నది. నీవు స్వయంగానే వాటిని నిర్వహిస్తున్నావు. వాటివల్ల కలిగే ఫలాన్ని నీవే ముఖ్యంగా పొందుతున్నావు. ఈ విధంగా అన్నిటిని నీవే నిర్వహిస్తున్నందున మోక్షాన్ని పొందడానికి ఈ లోకంలో నిన్నే సహజమైన ఉపాయంగా పెద్దలు పల్కుతున్నారు

*11) యోగ్యం ముకుంద!గుణభేద మచేతనేషు*
*భోక్తృత్వమాత్మని నివేశ్య నిజేచ్ఛయైవ।*
*పాంచాలికాశుకవిభూషణభోగదాయీ*
*సమ్రాడివాత్మ సమయా సహ మోదసే త్వమ్॥*

స్వామీ!అనుభవించదగిన పలు విధాలైన గుణాలను అచేతనవస్తువులలోను, అనుభవించే స్వభావాన్ని జీవులలోను నీ సంకల్పంతోనే ఏర్పరచి అచేతనమైన క్రీడాప్రతిమకు, చేతనమైన చిలుకకు ఆభరణాలను, భోగాలను కల్గించే చక్రవర్తి వలె నీవు, నీకు తగిన లక్ష్మితో ఆనందిస్తున్నావు

12) *త్వాం మాతరం చ పితరం సహజం నివాసం*
*సంతః సమేత్య శరణం సుహృదం గతిం చ।*
*నిస్సీమ నిత్యనిరవద్య సుఖప్రకాశం*
*దీపప్రకాశ! సవిభూతిగణం విశంతి॥*

దీపప్రకాశస్వామీ! మహాత్ములు నిన్ను తల్లిగా, తండ్రిగా, సహోదరునిగా, నివాసంగా, స్నేహితునిగా, గతిగా, శరణు పొంది, అంతు లేని, నిత్యమైన, -దుఃఖం లేని ఆనందాన్ని, జ్ఞానాన్ని కలవానినిగా, విభూతులతో, గుణాలతో కూడినవానినిగా అనుభవిస్తున్నారు (దర్శిస్తున్నారు)

13) *జంతోరముష్య జననే విధిశంభుదృష్టో*
*రాగాదినేవ రజసా తమసా చ యోగః।*
*ద్వైపాయనప్రభృతయ స్త్వదవేక్షితానాం*
*సత్త్వం విముక్తినియతం భవతీత్యుశంతి॥*

ఈ జీవుని, అతడు జన్మించేటపుడు, బ్రహ్మగాని, శివుడుగాని చూస్తే రజోగుణాన్ని, తమోగుణాన్ని కలవాడవుతున్నాడు. నీవు కటాక్షిస్తే మోక్షాన్ని తప్పక కల్గించే సత్త్వగుణాన్ని పొందుతున్నాడు– అని వ్యాసాది మహర్షులు పలికారు.

*14) కర్మస్వనాదివిముఖేషు సమో దయాళుః*
*స్వేనైవ క్లుప్తముపదేశ మవేక్షమాణః।*
*స్వప్రాప్తయే తనుభృతాం త్వరసే ముకుంద!*
*స్వాభావికం తవ సుహృత్త్వమిదం గృణంతి॥*

ముకుందా! శరీరాన్ని పొందిన జీవులకు అనాదిగా ఏర్పడే, వివిధాలైన కర్మలను అనుసరించి నీవు వారిపట్ల సమంగా వర్తిస్తావు. కరుణ నిండిన నీవు నీవల్లనే భక్తులకు ఏర్పడే చిన్న వ్యాజాన్ని- సుకృతాన్ని- ఆధారంగా చేసికొని నిన్ను వారికి అనుగ్రహించాలని త్వరపడతావు. ఈ గుణాన్ని నీ సహజమైన సుహృత్త్వంగా పెద్దలు పల్కుతున్నారు.

*15) నిద్రాయితాన్ నిగమవర్త్మని చారుదర్శీ*
*ప్రస్థానశక్తిరహితతాన్ ప్రతిబోధ్య జంతూన్।*
*జీర్ణస్తనంధయజడాంధనిభాస్మాన్*
*నేతుం ముకుంద! యతసే దయయా సహ త్వమ్॥*

ముకుందా!చక్కని దృష్టిని కల నీవు దయతో వేదం పల్కిన దారిలో ప్రయాణం చేయకుండా నిద్రించేవారమై, అ దారిలో నడిచే శక్తిని లేనివారమై, వృద్ధులు, బాలురు, జ్ఞానం లేనివారు, అంధులు మొదలైనవారివలె ఉండే మమ్ములను తట్టి లేపి, మంచి దారిలో నడిపించాలని ప్రయత్నిస్తున్నావు.

*16) భక్తిప్రపత్తిరథవా భగవన్! తదుక్తిః*
*తన్నిష్ఠసంశ్రయ ఇతీవ వికల్ప్యమానమ్।*
*యం కంచిదేక ముపపాదయతా త్వయైవ*
*త్రాతా స్తరంత్యవసరే భవినో భవాబ్ధిమ్॥*

భగవన్! భక్తియోగం, శరణాగతిని, లేక ప్రపత్తివాక్యాన్ని పల్కడం, ప్రపత్తి చేసిన ఆచార్యులను, లేక, భాగవతులను ఆశ్రయించడం– అనే ఈ రీతులలో వర్గీకరింపబడే ఉపాయాలలో ఏదో ఒక ఉపాయాన్ని అనుష్ఠింపజేసే నీచేతనే రక్షింపబడే సంసారులు తగిన సమయంలో సంసార సముద్రాన్ని దాటుతున్నారు.

17) *నానావిధై రకపటై రజహత్స్వభావైః*
*అప్రాకృతైః నిజవిహారవశేన సిద్ధైః।*
*ఆత్మీయరక్షణ విపక్షవినాశనార్థైః*
*సంస్థాపయస్యనఘజన్మభి రాద్యధర్మమ్॥*

భగవన్! పలు విధాలైనవి, సత్యమైనవి, తన సహజస్వభావాన్ని విడువనివి, పంచభూతాల సమ్మేళనంతో నిర్మింపడనివి, తన లీలకోసం ఏర్పడేవి, భక్తులను రక్షించడంకోసం, శత్రువులను శిక్షించడంకోసం ఏర్పడేవి, దోషం లేనివి అయిన నీ అవతారాలతో నీవు కృతయుగధర్మాన్ని చక్కగా స్థాపిస్తున్నావు.

18) *నిమ్నోన్నతాని నిఖిలాని పదాని గాఢం*
*మజ్జంతి తే మహిమసాగరశీకరేషు।*
*నీరంధ్రమాశ్రయసి నీచజనాస్తథాపి*
*శీలేన హంత!శిశిరోపవనేశ్వర !త్వమ్॥*

తిరుత్తణ్ కా అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే స్వామీ! నీ మహిమ అనే సముద్రంలోని చిన్న తుంపురులలో సమస్తజగత్తు క్రిందకు పైకి మునుగుతున్నది. అంతటి మహిమను కలవాడవైనా, నీవు నీ సౌశీల్యంవల్ల కొంచం కూడా తేడా లేకుండా తక్కువవారిలోకూడా కలసి ఉంటావు. ఇది ఎంత ఆశ్చర్యకరం!!

*19) కాశీవృకాంధకశరాసనబాణగంగాః*
*సంభూతినామకృతిసంవదనాద్యదంతైః।*
*స్వోక్త్యంబరీషభయశాపముఖైశ్చ శంభుం*
*త్వన్నిఘ్న మీక్షితవతామిహ కః శరణ్యః॥*

కాశిలో జరిగిన యుద్ధం, వృకాసురుని వృత్తాంతం, అంధకాసురుని కథ, శివుని విల్లు నిర్వీర్యం అయిన కథ, బాణాసురకథ, గంగావతరణవృత్తాంతం, బ్రహ్మ శివునకు పేరు పెట్టిన వృత్తాంతం, శివుడు స్వయంగా చెప్పిన వృత్తాంతం, అంబరీషునివల్ల కల్గిన భయం, భృగుమునిశాపం మొదలైనవానివల్ల శివుడు నారాయణునకు (నీకు) పరతంత్రుడని తెలిసినవారికి ఈ లోకంలో శరణు పొందడానికి నీవు తప్ప ఇంక వేరెవరున్నారు?

*20) క్వాసౌ విభుః క్వ వయ మిత్యుపసత్తిభీతాన్*
*జంతూన్ క్షణాత్ త్వదనువృత్తిషు యోగ్యయంతీ।*
*సంప్రాప్తసద్గురుతనోః సమయే దయాళోః*
*ఆత్మావధిర్భవతి సంస్కృతధీః క్షణం తత్*

తగిన కాలంలో సదాచార్యరూపాన్ని పొందినవాడవు, గొప్ప కరుణను కలవాడవైన నీచే క్షణకాలంలో సంస్కరింపబడ్డ జ్ఞానం " అంతటా వ్యాపించి ఉండే ఈ భగవానుడెక్కడ? మనమెక్కడ? అని సందేహించి భయపడినవానిని నీ అంతరంగకైంకర్యంలో యోగ్యత కలవానినిగా చేస్తుంది. ఆ జ్ఞానం, ఆత్మాంతంగా, శాశ్వతంగా నిలచి ఉంటుంది. ఆహా!ఏమి నీ కరుణ ఎంత గొప్పది!

*21) యోగ్యం యమైశ్చ నియమైశ్చ విధాయ చిత్తం,*
*సంతో జితాసనతయా స్వవశానువర్గాః ।*
*ప్రత్యాహృతేంద్రియగణాః స్థిరధారణా స్త్వాం*
*ధ్యాత్వా సమాధియుగళేన విలోకయంతి ॥*

మహాత్ములు యమనియమాలతో తమ మనస్సును యోగ్యత కల్గినదానినిగా చేసికొని, ఆసనాలద్వారా ప్రాణవాయువులను నియంత్రించుకొని, జితేంద్రియులై, నీలో నిలుపుకొన్న మనస్సును కలవారై, నిన్ను ధ్యానించి, సవికల్పసమాధి, నిర్వికల్పసమాధులనే రెండు సమాధులలో నిన్ను దర్శిస్తున్నారు.

*22) పద్మాభిరామవదనేక్షణపాణిపాదం*
*దివ్యాయుధాభరణమాల్యవిలేపనం త్వామ్ ।*
*యోగేన నాథ శుభమాశ్రయమాత్మవంతః*
*సాలంబనేన పరిచింత్య న యాంతి తృప్తిమ్ ॥*

స్వామీ! పరిశుద్ధమైన మనస్సును కలవారు తామరపూవువలె అందమైన ముఖాన్ని, నేత్రాలను, చేతులను, పాదాలను కలవాడవై, గొప్ప ఆభరణాలను, ఆయుధాలను, మాలికలను, చందనాది లేపనాలను ధరించినవాడవై, పాపాన్ని పోగొట్టేవాడవైన (దివ్యరూపాన్ని కలవాడవైన) నిన్ను, నీ రూపాన్ని ఆశ్రయించిన ధ్యానంతో, చక్కగా ఎంతసేపు చింతించినా తృప్తిని పొందడంలేదు.

*23) మానాతిలంఘిసుఖబోధమహాంబురాశౌ*
*మగ్నాః త్రిసీమరహితే భవతః స్వరూపే।*
*తాపత్రయేణ విహతిం న భజంతి సంతః*
*సంసారధర్మ జనితేన సమాధివంతః ॥*

అంతు లేని జ్ఞానానందాలకు మహాసముద్రం వంటిదై, మూడు విధాలైన పరిచ్ఛేదాలను లేనిదై ఉండే నీ స్వరూపాన్ని అవగాహించినవారై (దర్శించినవారై), భక్తియోగాన్ని చేసే జ్ఞానులు సంసారంలోని వేడిమివల్ల కల్గిన తాపత్రయంతో దుఃఖాన్ని పొందరు.

*24) ధీసంస్కృతాన్ విదధతామిహ కర్మభేదాన్,*
*శుద్ధం జితే మనసి చింతయతాం స్వమేకమ్।*
*త్వత్కర్మ సక్తమనసామపి చాపరేషాం,*
*సూతే ఫలాన్యభిమతాని భవాన్ ప్రసన్నః॥*

ఈ లోకంలో జ్ఞానంచేత సంస్కరింపబడిన పలు విధాలైన కర్మలను చేసేవారికి (కర్మయోగాన్ని అనుష్ఠించేవారికి), యమనియమాదులతో

నియంత్రించిన మనస్సులో సంసారబంధం లేని శుద్ధమైన ఆత్మను ధ్యానించేవారికి (జ్ఞానయోగనిష్ఠులకు), నీ లీలలలో ఆసక్తిని పొందిన మనస్సును కలవారికి, ఇంకా, నీ సేవను కోరుకొనే ఇతరులకు వారి వారి అభిమతఫలాలను నీవు సంతోషంగా ఇస్తావు.

*25) ఉద్బాహుభావ మపహాయ యథైవ సర్వః*
*ప్రాంశుం ఫలార్థమభియాచతి యోగిచింత్య!/*
*ఏవం సుదుష్కర ముపాయగణం విహాయ*
*స్థానే నివేశయతి తస్య విచక్షణ స్త్వామ్. //*

యోగులచే చింతింపదగినవాడా! పొట్టివాడు ఎత్తున ఉండే పండును పొందడంకోసం తన చేతులను పైకెత్తడం మాని, పొడుగుగా ఉండేవానిని దానిని కోసి ఇమ్మని ఏ విధంగా ప్రార్థిస్తాడో,. ఆ విధంగానే, బుద్ధిమంతుడు తాను చేయడానికి సాధ్యం కాని కర్మయోగం మొదలైన అన్యోపాయా లను విడచిపెట్టి, వాటి స్థానంలో నిన్ను ఉపాయంగా నిలుపుకొంటున్నాడు.

*26) నిత్యాలసార్హమభయం నిరపేక్షమన్యైః*
*విశ్వాధికార మఖిలాభిమతప్రసూతమ్/*
*శిక్షావిశేషసుభగం వ్యవసాయసిద్ధాః*
*సత్కుర్వతే త్వయి ముకుంద! షడంగయోగమ్//*

స్వామీ! ఎల్లప్పుడు తన రక్షణకు స్వప్రవృత్తి తగదని, (భగవానుడే ఉపాయమని తలచి, తమ ప్రయత్నాన్ని చేయని సోమరులవంటి) ప్రపన్నులు చేయదగినది,. భయం లేనిది,. మిగిలిన దేనినీ సహాయంగా

కోరనిది, అందరు చేయదగినది, కోరినవానిని అన్నిటిని ఇచ్చేది, చక్కని అభ్యాసంతో చేయడానికి సులభమయినది, నీ విషయంలో ఆరు అంగాలను కల్గినది అయిన ప్రపత్తిని మహావిశ్వాసాన్ని కలవారు గొప్ప ఉపాయంగా గౌరవిస్తున్నారు

*27) త్వత్ప్రాతికూల్యవిముఖాః స్ఫురదానుకూల్యాః*
*కృత్వా పునః కృపణతాం విగతాతిశంకాః /*
*స్వామిన్! భవ స్వయ ముపాయ ఇతీరయంతః*
*త్వయ్యర్పయంతి నిజభార మపారశక్తౌ//*

స్వామీ! జ్ఞానులు నీకు ప్రతికూలంగా ప్రవర్తించడం మానినవారై, నీ పట్ల స్పష్టంగా అనుకూలంగా వర్తించేవారై, తమ నైచ్యాన్ని వ్యక్తం చేసేవారై,. సందేహం తీరినవారై, నీవే ఉపాయం కావాలని అర్థించేవారై అంతు లేని శక్తిని కల నీపై తమ రక్షణభారాన్ని ఉంచుతున్నారు.

ఈ శ్లోకంలో ప్రపత్తి యొక్క 5 అంగాలు, అంగి అయినా భర సమర్పణం చెప్పబడుతున్నవి.

దీపప్రకాశస్వామీ! ప్రపత్తిని చేయాలని ప్రయత్నం చేసే జ్ఞానులు నీ మనసుకు ఇష్టం లేని కార్యాలను చేయడం లేదు– అనే నిశ్చయాన్ని పొందుతున్నారు. దీనికి ప్రాతికల్య వర్జనం అని పేరు. వారు నీ మనసుకు అనుకూలమైనవాటినే చేయడంలో నిశ్చయాన్ని కలిగి ఉన్నారు. దీనికి అనుకూలయ సంకల్పం అని పేరు. వారు తమ వద్ద ఏ విధమైన ఉపాయం

చేయడానికికూడా తగిన శక్తి లేకపోవడాన్ని భావించి, గర్వాన్ని విడచిపెట్టి, నీకు కరుణ కలిగేటట్లు ప్రార్థిస్తున్నారు. దీనికి కార్పణ్యం అని పేరు. ఫలాన్ని పొందడంలో అన్ని సందేహాలను విడిచిపెట్టి, నిశ్చయంగా ప్రపత్తి ఫలాన్ని ఇచ్చి తీరుతుంది అనే గొప్ప నమ్మకను కలిగి ఉన్నారు. దీనికి మహా విశ్వాసం అని పేరు. " నీవే ఉపాయంగా నిలచి నన్ను రక్షించాలి" అని ప్రార్థిస్తున్నారు. దీనికి గోప్తృత్వ వరణం అని పేరు. తరువాత, అంతు లేని శక్తి కలిగినవాడవైన నీ వద్ద తమను రక్షించే బాధ్యతను సమర్పిస్తున్నారు. ఇదే అంగి అయిన భరసమర్పణం.

*28) అర్థాంతరేషు విముఖా నధికారహానేః*
*శ్రద్ధాఘనాన్ త్వదనుభూతివిళంబభీతాన్।*
*దీపప్రకాశ !లభసే సుచిరాత్ కృతీవ*
*న్యస్తాత్మన స్తవ పదే నిభృతాన్ ప్రపన్నాన్॥*

దీపప్రకాశా! యోగ్యత లేనందువల్ల -ఆత్మస్వరూపానికి విరుద్ధాలైనందువల్ల - మిగిలిన ఉపాయాలలో దృష్టి లేనివారై, మహావిశ్వాసమనే సంపదను కలవారై, నిన్ను అనుభవించడంలో ఆలస్యాన్ని సహించలేనివారై, నీ చరణాలలో తమ ఆత్మను సమర్పించి నిర్భరులైన ప్రపన్నులను నీవు గొప్ప భాగ్యాన్ని పొందినట్లు పొందుతున్నావు.

దీప ప్రకాశస్వామీ! పలువురు మహాత్ములు మోక్షాన్ని పొంది, నీ శ్రీచరణాలలో పరిపూర్ణమైన కైంకర్యం చేయడంలో చాలా తీవ్రమైన ఆసక్తిని పొందుతున్నారు. మోక్షానికి ఉపాయంగా భక్తియోగాన్ని చేయడానికి వారికి

శక్తి లేదు. దానికి చాలా జ్ఞానం, శక్తి మొదలైనవి కావాలి. చిరకాలం అయిన తర్వాతనే భక్తియోగం ఫలాన్ని ఇస్తుంది– అని వారు భయపడుతున్నారు. ఇంతే కాక, భక్తి యోగాన్ని చేయడంలో ఎన్నో శ్రమలు ఉన్నాయి. దాని అంగాలు అన్నీ ఋజువుగా చేయడం అంత సులభం కాదు. అందుచేత వారికి భక్తియోగం మొదలైనవాటిలో ఉద్దేశ్యమే లేదు. సులభమైన ప్రపత్తిలో ప్రపత్తిలో వారు మహావిశ్వాసాన్ని పొందుతున్నారు. నీ శ్రీచరణాలలో తమ ఆత్మను సమర్పించి, భరన్యాసాన్ని చేస్తున్నారు. ప్రయోజనాన్ని పొందడంలో ఉండే నిశ్చయించేత ఏ విధమైన మనశ్చాంచల్యం లేకుండా స్థిరంగా నిలచి ఉన్నారు. ఇటువంటి మహాత్ములను పొందానికి నీవు చిరకాలంగా ఆశపడుతున్నావు. వారిని పొందడం వల్ల నీవు నిన్ను గొప్ప భాగ్యశాలివిగా భావిస్తున్నావు.

*29) మంత్రై రనుశ్రవముఖేష్వధిగమ్యమానైః*
*స్వాధిక్రియాసముచితైః యదివాఽఽన్యవాక్యైః।*
*నాథ ! త్వదీయచరణౌ శరణం గతానాం.*
*నైవాయుతాయుతకలాఽప్యపరై రవాప్యా ॥*

స్వామీ ! తమ యోగ్యతకు తగినవి అయిన, వేదాదులద్వారా తెలియబడే మంత్రాలతో, లేక, అన్యవాక్యాలతో నీ చరణాలను శరణు పొందినవారి మహిమలోని కోటిలో ఒక భాగం కూడ మిగిలినవారు పొందలేరు. (నిన్ను శరణాగతి చేసినవారు మిగిలినవారికంటే చాలా గొప్పవారు.)

దీప ప్రకాశస్వామీ! ప్రపత్తిని చేయడానికి కొన్ని మంత్రాలు ఉన్నాయి. ఈ మంత్రాలు వేదంలోను, శ్రీపాంచరాత్రం మొదలైన సంహితలలోనూ ఉన్నాయి. ఈ మంత్రాలలో, వారి వారి యోగ్యతకు తగిన వాటిని గ్రహించి ప్రపత్తిని చేయాలి. వీటిని ఉచ్చరించడానికి జాతిని బట్టి తేడా ఉన్నది. ఈ మంత్రాలను చెప్పడానికి యోగ్యత లేనివారు తమకు తగిన ఆళ్వారుల, ఆచార్యుల శ్రీ సూక్తి వాక్యాలను ఉపయోగించి ప్రపత్తిని చేయవచ్చు. ఈ విధంగా ఈ మంత్రాలను ఉపయోగించి గాని, లేక, మిగిలిన వాక్యాలను ఉపయోగించి గాని నీ చరణాలలో ప్రపత్తిని చేసినవారి గొప్పతనం చూసినట్లయితే, వీరి గొప్పతనంలో ఒక కోటిలోని ఒక భాగాన్ని కూడా మిగిలిన ఉపాయాలను చేసినవారి చేత పొందడం సాధ్యం కాదు— అనేది వ్యక్తమవుతుంది.

*30) దత్తాః ప్రజా జనకవత్ తవ దేశికేంద్రైః*
*పత్యా ఽ భినంద్య భవతా పరిణీయమానాః ।*
*మద్ధ్యే సతాం మహితభోగవిశేషసిద్ధ్యై*
*మాంగల్యసూత్రమివ బిభ్రతి కింకరత్వమ్॥*

తండ్రివంటివారైన గొప్ప ఆచార్యులచే నీకు సమర్పింపబడిన చేతనులు (వధువులు) నాథుడవైన నీచే అభినందింపబడి, స్వీకరింపబడినవారై, గొప్ప భోగాలను అనుభవించడంకోసం మంగళసూత్రంవంటి భాగవతకైంకర్యాన్ని మధ్యలో చేస్తున్నారు (భాగవతకైంకర్యాన్ని చేయడం ప్రపన్నులకు మంగళసూత్రాన్ని ధరించడంవంటిది)

దీప ప్రకాశ స్వామి లోకంలో తండ్రిగా అయినవాడు తన కుమార్తెను ఒకనికి ఇచ్చినట్లయితే, వివాహం చేసికొనేవాడు సంతోషంతో ఆ కన్యను స్వీకరిస్తాడు. ఆ కన్య అతడు అలంకరించే మంగళసూత్రాన్ని తన భర్త ద్వారా పలు మంగళాలను పొందడం కోసం తన శరీరం ఉన్నంతవరకు అలంకరించుకొని, గౌరవంగా దానిని కాపాడుకుంటుంది. ఆ విధంగానే, ఆచార్యులు జీవాత్మలను నీ శ్రీచరణాలలో సమర్పిస్తున్నారు. ప్రపత్తి చేసిన జీవులను నీవు సంతోషంతో స్వీకరిస్తున్నావు. వారు నిన్ను పరిపూర్ణంగా అనుభవించి, ఆనందాన్ని పొందడాన్ని భావిస్తూ, ఈ లోకంలో ఈ శరీరం ఉన్నంతవరకు ఉండే కాలంలో భాగవత కైంకర్యాలను చేస్తూ, మంచిగా కాలాన్ని గడపుతున్నారు. ఇది పతివ్రత అయిన కన్య తన మంగళసూత్రాన్ని శ్రద్ధగా రక్షించుకోవడంవంటిది అవుతున్నది.

*31) దివ్యే పదే నియతకింకరతాధిరాజ్యం*
*దాతుం త్వదీయదయయా విహితాభిషేకాః।*
*ఆదేహపాత మనఘాః పరిచర్యయా తే*
*యుంజానచింత్య! యువరాజపదం భజంతి॥*

యోగులచే ధ్యానింపదగినవాడా! వైకుంఠమనే గొప్ప స్థానంలో నిత్యకైంకర్యాన్ని చేయడమనే ఆధిరాజ్యాన్ని ఇవ్వడంకోసం నీ దయవల్ల పట్టాభిషేకం చేయబడినవారై, పాపం లేనివారైన ప్రపన్నులు ఈ శరీరం పతనం చెందేవరకు నీకు కైంకర్యం చేయడంవల్ల ఈ లోకంలో యువరాజపదాన్ని పొందుతున్నారు.

యోగంలో ధ్యానానికి లక్ష్యమై ఉండే దీప ప్రకాశస్వామీ! నీ శ్రీచరణలలో ప్రపత్తిని చేసిన వారు ప్రాపర్టీకి ముందు చేసిన పాపాలు తీరిపోతాయి. తరువాత, అజ్ఞానం చేత చేసిన పాపాలు వారిని అంటకుండా ఉంటాయి. వారు తరువాత శ్రీ వైకుంఠంలో చేయబోయే నిత్య కైంకర్యం ఒక గొప్ప రాజ్యాన్ని పాలించడంవంటిది అవుతుంది. ఆ రాజ్యాన్ని నీవు ఇప్పుడే నీ కరుణ అనే అమృత ప్రవాహంతో వారికి పట్టాభిషేకం చేస్తున్నావు ఈ శరీరం తొలగిపోయేవరకు వారు ఈ లోకంలో నీకు కైంకర్యం చేస్తూ ఉన్నారు. ఈ పని వారు ఇకపై శ్రీ వైకుంఠంలో పొందబోయే గొప్ప రాజ్యానికి పూర్వాంగమైన యువరాజ పదవి అవుతున్నది. లోకంలో కూడా ఒక ప్రభువు యువరాజ కుమారుడు తరువాత తాను పొందబోయే గొప్ప రాజ్యానికి ముందు యువరాజ పదవిని పొందడం క్రమంలో ఉన్నదే కదా

32) *త్వాం పాంచరాత్రికనయేన పృథగ్విధేన*
*వైఖానసేన చ పథా నియతాధికారాః।*
*సంజ్ఞావిశేషనియమేన సమర్చయంతః*
*ప్రీత్యా నయంతి ఫలవంతి దినాని ధన్యాః॥*

భాగ్యవంతులు వివిధాలైన పాంచరాత్రాగమ ప్రకారాలతో, వైఖానసాగమవిధానాలతో ఆ యా ఆగమాలలో విధింపబడిన తమ తమ అధికారాలకు తగినట్లు, ఆ యా ప్రకారాలకు చెప్పబడిన పేర్లకు తగినట్లు, నిన్ను సంతోషంగా ఆరాధిస్తూ, తమ కాలాన్ని ప్రయోజనంతో కూడినదిగా గడుపుతారు.

దీప ప్రకాశస్వామీ! శ్రీ పాంచరాత్ర శాస్త్రం, వైఖానస ఆగమం అనే రెండు వేరు వేరు విభాగాలను కలిగినవి. ఈ రెండు శాస్త్రాలలో ఒకదానికి చెందినవారు వేరొక దానిని అనుసరించకూడదు –అనే ఒక క్రమం ఉన్నది. ఈ విధంగానే ఆయా క్రమానికి పేర్లు కూడా విభాగం చేయబడ్డాయి. అవి ఏవి? అంటే, శ్రీపాంచరాత్రంలో అర్చామూర్తికి వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు మొదలైన తిరునామాలు, వైఖానస ఆగమంలో విష్ణువు, పురుషుడు, సత్యుడు అచ్యుతుడు మొదలైన తిరునామాలు చెప్పబడ్డాయి. ఈ తేడాలను అతిక్రమించకుండా, మిక్కిలి భక్తితో ఆయా దివ్యదేశాలలో క్రమానుసారంగా అర్చకులు నిన్ను ఆరాధిస్తున్నారు. వారు, ఈ విధంగా తమ జీవిత కాలాన్ని చక్కని క్రమంలో వినియోగించి, ఆనందిస్తున్నారు.

*33) వర్ణాశ్రమాదినియతక్రమసూత్రబద్ధాః*
*భక్త్యా యథార్హవినివేశితపత్రపుష్పాః।*
*మాలేవ కాలవిహితా హృదయంగమా త్వాం*
*ఆమోదయత్యనుపరాగధియాం సపర్యా॥*

ఆ యా జాతులకు, ఆ యా ఆశ్రమాలకు శాస్త్రాలలో విధింపబడిన క్రమాలకు తగినట్లుగా, పత్రపుష్పాదులతో తగిన కాలంలో నీ పట్ల భక్తిని కల మహనీయులు చేసే మనోహరమైన ఆరాధన నిన్ను చాలా ఆనందింపజేస్తున్నది.

దీప ప్రకాశస్వామీ! పరమ భాగవతులు అయిన సాధువులు అన్యప్రయోజనాలలో మనస్సును పెట్టుకోకుండా ఉన్నవారై, విరక్తులై, మిక్కిలి భక్తితో నిన్ను ఆరాధిస్తున్నారు. వారు, బ్రాహ్మణులు మొదలైన జాతికి, బ్రహ్మచారి మొదలైన ఆశ్రమాలకు ఉండే క్రమాలను కొంచెం కూడా దాటకుండా, ఆపస్తంబుడు, బోధాయనుడు మొదలైన ఆ యా సూత్రకారులు చెప్పిన దానికి కట్టుబడి నిన్ను పూజిస్తారు. తమ శక్తికి తగినట్లు తులసిని, అనేక విధాలయిన రంగులను కలిగిన పుష్పాలను నీకు సమర్పిస్తున్నారు. ఆయా కాలాలకు తగినట్లు విధించబడిన క్రమంలో తప్పకుండా ఆరాధిస్తున్నారు. వారు ఆరాధించే క్రమం నీ మనసును, మిగిలిన వారి మనసును ఆనందింప చేస్తున్నది. వారు చేసే ఇటువంటి పూజ నీవు అలంకరించుకునే పూలమాలిక వలె నిన్ను ఆనందింప జేస్తున్నది.

మాల నారతో కట్టబడుతుంది. అందులో, ఆయా స్థానాలకు తగినట్లు తులసిని, పలు రంగులను కలిగిన పూలను కూర్చడం జరుగుతుంది. తగిన కాలంలో వక్షఃస్థలంలో అలంకరించుకోబడుతుంది. మిక్కిలి పరిమళాన్ని వీస్తుంది. (అందుచేత మాలను ఇక్కడ ఉపమానంగా చెప్పడం జరిగింది.)

*34) బ్రహ్మ గిరీశ ఇతరేష్వమరా య ఏతే*
*నిర్ధూయ తాన్ నియతతుల్యఫలప్రసూతీన్।*
*ప్రాప్తుం త్వమేవ పదపద్మ యుగం ప్రతీతాః*
*పాతివ్రతీం త్వయి వహంతి పరావరజ్ఞాః॥*

బ్రహ్మ, శివుడు, మిగిలిన దేవతలు అందరు నరకంతో సమానమైన ఫలాలను ఇస్తారు. అందువల్ల వారిని విడచిపెట్టి, సర్వాధికుడవైన నిన్ను తెలిసికొని, మహనీయులు నీ చరణకమలాలను రెండిటిని ఆశ్రయించడంకోసం నీపట్ల పాతివ్రత్యాన్ని (భార్య భర్తను తప్ప ఇంకొకరిని ఆరాధించనట్లు నిన్ను తప్ప ఇంకొకరిని కొలువని స్థితిని) కలిగి ఉంటారు.

దీప ప్రకాశ స్వామి బ్రహ్మ శివుడు మొదలైన దేవతలు అందరూ నరకానికి సమానమైన అల్ప ఫలాలను ఇవ్వగలిగినవారు మాత్రమే. "నీవు మాత్రమే పరదేవతవు. మిగిలినవారు అందరూ అవరదేవతలే" అని యథార్థమైన జ్ఞానాన్ని పొందిన పరమైకాంతులు అని పొగడబడే మహాత్ములు అల్ప ప్రయోజనాలనే ఇచ్చే ఇతర దేవతలను అందరినీ కాదని, పక్కకు పెడుతున్నారు. నీ శ్రీచరణ పద్మాలనే ఆశ్రయించాలని కోరుతున్నారు. అందుకోసం వారు పతివ్రతా ధర్మాన్ని ఆచరిస్తున్నారు. ఒక ప్రతివ్రత అయిన స్త్రీ అన్యపురుషులను మనస్సులో కూడా భావించకుండా, కేవలం భర్తను మాత్రమే దైవంగా గ్రహించేటట్లు, వీరు కూడా అన్యదేవతలను బహిష్కరించి నిన్నే సేవిస్తున్నారు.

*35) నాథ! త్వదిష్టవినియోగవిశేషసిద్ధం*
*శేషత్వసార మనపేక్ష్య నిజం గుణజ్ఞాః।*
*భక్తేషు తే వరగుణార్ణవ! పారతంత్ర్యాత్*
*దాస్యం భజంతి విపణివ్యవహారయోగ్యమ్.*

స్వామీ! గొప్ప గుణాలకు సముద్రంవంటివాడా! గుణాలను తెలిసినవారు (విజ్ఞులు) నీకు ఇష్టమైన రీతిలో ఉపయోగపడే గొప్పతనంచేత ఏర్పడిన తమ శేషత్వంతో తృప్తిపడకుండా, నీ భక్తులకు వశమై ఉన్నందున, తమ వశంలో ఉండే వస్తువును ఇతరులకు అమ్మే రీతిలో, శేషత్వపరాకాష్ఠను పొందుతున్నారు.

గొప్పవి అయిన కళ్యాణ గుణాలకు సముద్రమై వెలిగే దీపప్రకాశస్వామీ! జీవులు నీకు శేషభూతులు. నీవు వారికి శేషివై, అంటే, స్వామివై ఉన్నావు. నాథుడై ఉండేవాడు తనకు దాసులై ఉన్నవారిని తనకు ఇష్టం వచ్చినట్లుగా ఉపయోగించుకోవచ్చు కదా. అందుచేత, నీ దాసులైన జీవులనునీవు అన్యభాగవతులకు దాసులుగా చేస్తున్నావు. ఈ దాస్యం వారికి సహజమైనదిగానే అవుతున్నది. ఈ విధంగా సహజమై తమకు ఏర్పడిన దాస్యస్వభావంతో "ఇది చాలు" అని వారు అనుకోవడం లేదు. భాగవతుల ఉన్నతమైన గుణాలను దర్శించి, వాటిలో అభినివేశం పొందినాగాని, వారికి దాసులై ఉంటున్నారు. అందుచేత, అంగడిలో మానవులు తమ వస్తువులను ఇతరులకు అమ్మేటట్లుగానే, తమను భాగవతులకు అమ్మే అవధికి ఉండే దాస్యదశను వారు పొందుతున్నారు.

*36) సద్భిః త్వదేకశరణైః నియతం సనాథాః*
*సర్పాదివత్ త్వదపరాధిషు దూరయాతాః।*
*ధీరాః తృణీకృతవిరించిపురందరాద్యాః*
*కాలం క్షిపంతి భగవన్! కరణై రవంధ్యైః ॥*

భగవన్! మనస్సులో స్థిరమైన నిశ్చయాన్ని కల పరమైకాంతులు నిన్ను ఒక్కని మాత్రమే శరణంగా ఆశ్రయించిన మహనీయులను సదా నాథులుగా కలవారై ఉంటారు నీ విషయంలో అపచారపడిన వారిని చూచి పామును చూచినట్లు భయపడి, వారికి దూరంగా తొలగిపోతారు. బ్రహ్మేంద్రాది పదవులను కూడా వారు గడ్డిపరకతో సమానంగా తలచి, తమ ఇంద్రియాలను సఫలం చేసికొంటూ కాలం గడపుతారు.

దీపప్రకాశస్వామీ! మిక్కిలి మనఃస్థైర్యంతో నీ విషయంలో ప్రపత్తిని చేసిన పరమైకాంతులు, నిన్నే శరణంగా కలిగిన భాగవతులనే తమకు ఎల్లప్పుడూ నాథులుగా భావిస్తున్నారు. నీ భక్తుల పట్ల అపచారం చేసే మానవులను చూస్తే, పామును చూచినట్లుగా భయపడి, వారికి దూరంగా తొలగిపోతున్నారు. బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతల దగ్గర నుండి తాము పొందవలసినది ఏమీ లేదు కనుక, ఆ దేవతలను తృణంగా భావిస్తున్నారు. తమ ఇంద్రియాలను వ్యర్థం చేయకుండా, భగవద్భాగవత సేవలకు వినియోగిస్తూ, తమ జీవితకాలాన్ని గడుపుతున్నారు.

*37) వాగాదికం మనసి తత్ పవనే స జీవే*
*భూతేష్వయం పునరసౌ త్వయి తైః సమేతి।*
*సాధారణోత్క్రమణకర్మ సమాశ్రితానాం*
*యంత్రా ముకుంద! భవతైవ యథాయమాదేః॥*

స్వామీ!యమాదులకువలె నియామకుడవైన నీచేతనే జీవులు శరీరంనుండి ఉత్క్రమించే క్రమం నిర్వహింపబడుతున్నది. అందరికి

సాధారణమైన క్రమంలో– జీవుల వాక్కు మొదలైన ఇంద్రియాలు మనస్సులో చేరుతున్నవి. ఆ మనస్సు ప్రాణంలో చేరుతున్నది. ఆ ప్రాణం జీవాత్మలో చేరుతున్నది. ఈ జీవుడు అయిదు భూతాలలో చేరుతున్నాడు. ఈ జీవుడు వాటితో పాటు నీలో చేరుతున్నాడు.

దీపప్రకాశస్వామీ! జీవుడు శరీరాన్ని విడచి పెట్టి బయటకు వచ్చేటప్పుడు, మొదట వాక్కు మొదలైన ఇంద్రియాలు పది మనసులో చేరుతున్నాయి, వాటితో కూడిన మనస్సు ప్రాణంలో చేరుతున్నది, తరువాత ఆ ప్రాణవాయువు జీవాత్మలో చేరుతున్నది, జీవాత్మ పంచభూతాల సూక్ష్మశరీరంతో చేరుతున్నాడు. ఈ విధంగా ప్రాకృత శరీరంనుండి బయటకు వచ్చే జీవునకు ఏర్పడే శ్రమను పోగొట్టడం కోసం నీవు ఆ జీవుని నీ హృదయంలో ఆలింగనం చేసుకుంటున్నావు. ఈ విధంగా జీవాత్మను శరీరంనుండి బయటకు వచ్చేటట్లు చేసేవాడవు నీవే. నీవు బయటకు వచ్చే జీవుని నీతో ఆలింగనం చేసుకునేవరకు ఉండే క్రమం పుణ్యశాలురు, పాపులు అనే అందరికీ సమానంగా ఉన్నది. ఈ విధంగానే యముడు మొదలైన దేవతల శరీరంనుండి ఆత్మ విడివడేటప్పుడు కూడా, నీవే జీవాత్మలను ఇదే క్రమంలో బయటకు వచ్చేటట్లు చేస్తున్నావు. అందరికీ లోపల ప్రవేశించి నియమించేవాడవు అయిన నీవల్లనే శరీరంనుండి జీవాత్మ బయటకు వచ్చే క్రమం సంభవిస్తున్నది.

*38) సవ్యాన్యయో రయనయోః నిశి వాసరే వా*
*సంకల్పితాయురవధీన్ సపది ప్రపన్నాన్।*
*ప్లోదః స్వయం నిజపదే వినివేశయిష్యన్*
*నాడీం ప్రవేశయతి నాథ! శతాధికాం త్వమ్॥*

స్వామీ!ఉత్తరాయణంలో కాని, దక్షిణాయనంలో కాని, రాత్రిలో కాని, పగలులో కాని, నీచే నిర్ణయింపబడిన ఆయుస్సు పూర్తి అయిన తరువాత, నిన్ను శరణు పొందినవారిని నీ స్థానమైన పరమపదంలో చేర్చేవాడవు, వారి హృదయ కమలంలో ఉండేవాడవైన నీవు నూటికి మించిన( 101) నాడులలో వారిని ప్రవేశింపజేస్తావు.

దీపప్రకాశస్వామీ! ప్రపత్తిని చేసేవారికి సంభవించే మరణంలో కొన్ని కాలభేదాలు ఉంటాయి. వారికి ఉత్తరాయణంలోనే, శుక్లపక్షంలోనే పగటివేలోనే మరణం సంభవిస్తేనే, మంచి లోకాలు పొందడానికి సాధ్యం అవుతుంది. వీటికి మారుగా ఉండే కాలంలో మరణం జరిగితే పుణ్యలోకాలను పొందడం వీలు కాదు. ఈ విధంగా శాస్త్రం చెబుతున్నది. అయితే, నీ శ్రీపాదాలలో భరన్యాసం చేసినవారికి ఈ కాలభేదక్రమం లేదు. వారికి దక్షిణాయనంలో కాని, లేక ఉత్తరాయణంలో కానీ, కృష్ణపక్షంలో కానీ, శుక్లపక్షంలో కానీ, పగలు కానీ, రాత్రి కానీ– ఎప్పుడూ మరణం సంభవించినప్పటికీ, దానివల్ల ఏవిధమైన హాని, లోటు వారికి లేదు. వారికి నియమించిన కాలంలో అవధికి ముందే నీచే సంకల్పింపబడినదానిని అనుసరించి వారు మరణించగానే వారిని దివ్యస్థానం అయిన పరమపదంలో శాశ్వతంగా నీవే ఉండేటట్లు చేయాలని నిశ్చయిస్తావు. అందుకోసం జీవాత్మల హృదయకమలంలో అంతర్యామిగా ఉండే నీవే

జీవులు శరీరంనుండి ఉత్క్రమించే కాలంలో 101వ నాడి అయిన మూర్ధన్యనాడిలో వారు ప్రవేశించేటట్లు చేస్తున్నావు. మిగిలిన నూఱు నాడుల ద్వారా ప్రవేశిస్తేనే, అవి స్వర్గం, నరకం మొదలైన లోకాలకు తీసుకుని పోయి చేరుస్తాయి. వాటిలో ప్రవేశించకుండా, ఈ మూర్ధన్యనాడి వారికి చక్కగా గోచరించేటట్లు చేసి, దాని ద్వారా వారు ప్రయాణం చేసేటట్లు నీవే చేస్తున్నావు. ఈనాడి ద్వారా ప్రయాణం చేస్తే కదా వారు పరమపదానికి చేరగలరు.

*39) అర్చిర్దినం విశదపక్ష ఉదక్ప్రయాణం*
*సంవత్సరో మరుదశీతకరః శశాంకః।*
*సౌదామనీజలపతిర్బలజిత్ప్రవేశః*
*ఇత్యాతివాహికసఖో నయసి స్వకీయాన్॥*

అగ్నిదేవత, అహస్సు, శుక్లపక్షం, వర్షాధిపతి, వాయుదేవత, సూర్యుడు, చంద్రుడు, అమానవుడనే విద్యుద్దేవత, వరుణుడు, ఇంద్రుడు, బ్రహ్మ – అనే ఆతివాహికులతో కూడినవాడవై, నీవు నిన్ను శరణు పొందినవారిని పరమపదానికి తీసికొనిపోతావు.

దీప ప్రకాశ స్వామీ! నీ విషయంలో ప్రపత్తిని చేసినవారిని 101 వ నాడి అయిన మూర్ధన్య నాడి ద్వారా ప్రయాణం చేసేటట్టు చేసి, దేవయానం అనే మార్గంలో నీవు అతనిని తీసుకొని పోతున్నావు. తరువాత, పలువురు ఆతివాహిక దేవతలు ఒక్కొక్కరుగా పరలోకానికి ప్రయాణం చేసే జీవుని ఆహ్వానించి, అనేక విధాలైన ఉపచారాలను చేసి, తమకు సాధ్యమైనంతలో సేవ చేస్తారు.

మొదట అగ్ని దేవత, తరువాత అహస్సు దేవత, శుక్లపక్ష దేవత, ఉత్తరాయణ దేవత, వర్ష దేవత, వాయుదేవత, సూర్యుడు, చంద్రుడు, మెరుపు అనే అమానవుడు, వీనికి సహాయకులైన వరుణుడు, ఇంద్రుడు, బ్రహ్మ మొదలైన వీరిని పురస్కరించుకొని, ఎదురు వచ్చి ఆహ్వానించి, ఉపచారం, చేసి దారిలో తీసుకొని పోయి వైకుంఠానికి చేర్చేటట్లు చేస్తున్నావు. అందుచేత, ఈ అన్ని ఉపచారాలను నువ్వే చేస్తున్నావు.

*40) త్వచ్ఛేషవృత్త్యనుగుణైః మహితైర్గుణౌఘైః*
*ఆవిర్భవంత్యయుతసిద్ధనిజస్వరూపే।*
*త్వల్లక్షణేషు నియతేష్వపి భోగమాత్రే*
*సామ్యం భజంతి పరమం భవతా విముక్తాః॥*

సంసారబంధంనుండి విముక్తిని పొందినవారికి నీకు కైంకర్యం చేయడానికి తగినవి, గొప్పవి అయిన సద్గుణాల సమూహంతోపాటు, నిన్ను ఏనాడూ విశ్లేషించని ఆత్మస్వరూపం వారికి ఆవిర్భవిస్తుంది. అపుడు, లక్ష్మీపతిత్వంవంటి చిహ్నాలు నీకే చెందినవి అయిన, అనుభవంలోమాత్రం నీతో పూర్ణమైన సామ్యాన్ని వారు పొందుతున్నారు.

దీపప్రకాశస్వామీ! నీవిషయంలో ప్రపత్తిని చేసినవారు సంసార బంధం తీరినవారై, నీ దివ్యస్థానం అయిన వైకుంఠానికి చేరుతున్నారు. అక్కడకు వచ్చి నిన్ను పొందగానే, వారి, కర్మసంబంధంవల్ల ఇంతవరకు ఆవరింపబడి ఉండే ఉన్నతమైన గుణాలు అన్ని వ్యక్తం అవుతున్నాయి. ఈ గుణాలు మరుగుపడడం అనేది తొలగిపోయి, బయటకు వ్యక్తం అయినందున, ఇక నీకు పరిపూర్ణ కైంకర్యం చేయడానికి ఆ గుణాలు వారికి

ఉపయోగపడుతున్నాయి. నిజమైన ఆత్మస్వరూపాన్ని వారు దర్శించినందున, నిన్ను విడచి ఉండలేని, నీకు శరీరమై ఉండేదైన స్వభావాన్ని వారు పొందుతున్నారు. వారు పూర్తిగా నిన్ను పోలినవారుగానే అవుతున్నారు– అని ఉపనిషత్తు చెబుతున్నది. అయితే, మరి, ఇది ఏ విధంగా సాధ్యం? నీకే తగినది అయి ఉండే స్వభావాలు కొన్ని ఉన్నాయి కదా. అవి ఏవి? అంటే, లోకాన్ని సృష్టించడం, రక్షించడం మొదలైనవి, సర్వేశ్వరుడై ఉండడం, మోక్షం ఇవ్వడం మొదలైనవి, ఇవి అన్ని మిగిలినవారు పొందడానికి వీలైనవా? ఇవి అన్నీ నీకే తగినవి అయిన చిహ్నాలు కదా నిన్ను పూర్తిగా నిన్ను పోలినవారుగా ముక్తులు అవుతున్నారు అని అనడానికి మరి ఏమి తాత్పర్యం? అంటే, అనుభవం, జ్ఞానం, ఆనందం మొదలైనవాటిలో నీకు, వారికి మధ్య ఏ కొంచెం కూడా తేడా లేదు –అనేది తాత్పర్యం. నిన్ను నీవు అనుభవించేటట్లే, వారు కూడా నిన్ను అనుభవిస్తున్నారు. జ్ఞానం పరిపూర్ణమైన ప్రకాశంతో ఉండడంలో కూడా నీకు, వారికి మధ్య ఏ తేడా లేదు. లోకాలను సృష్టించడం మొదలైన కార్యాలతో నీవు పొందే ఆనందాన్ని వారు నీవు చేసే ఆ కార్యాలను నేరుగా చూడడం వల్లనే పొందుతున్నారు. ఇటువంటి సామ్యాలను వారు పూర్తిగా పొందుతున్నారు.

*41) ఇత్థం త్వదేకశరణై రనఘై రవాప్యే*
*త్వత్కింకరత్వవిభవే స్పృహయాఽపరాధ్యన్।*
*ఆత్మా మమేతి భగవన్!భవతైవ గీతాః*
*వాచో నిరీక్ష్య భరణీయ ఇహ త్వయాఽ హమ్॥*

భగవన్! ఈ విధంగా నిన్ను ఒక్కని మాత్రమే శరణు పొందినవారై, ఏ దోషం లేనివారైన మహాత్ములు పొందదగిన నీ కైంకర్యమనే సంపదలో ఆశను కల్గి ఉండంద్వారా నీ విషయంలో అపచారపడినవాడనైన నేను "నన్నే ఆశ్రయించిన భక్తుడు నా ఆత్మ "అని నీవు గీతలో పల్కిన మాటలను తలచి, నీవు తప్ప ఏ గతి లేని నన్ను నీవే రక్షించాలి.

దీపప్రకాశ స్వామీ! శ్రీ వైకుంఠంలో నీకు పరిపూర్ణమైన కైంకర్యం చేయడం అనే సంపద సులభంగా పొందడానికి సాధ్యమా? నిన్ను ఒక్కని మాత్రమే శరణు పొంది, ఏ విధమైన దోషం కూడా లేకుండా ఉండే మహానుభావులుకదా దానిని పొందగలరు. ఆ కైంకర్యాన్ని పొందడానికి యోగ్యత లేని నేను దీనిని ఆశపడుతున్నానే. ఈ ఆశను పొందడమే అపచారం అవుతున్నది. నీవే గీతలో, నిన్ను ఆశ్రయించినవారిని నీకు అంతర్యామి –అని అన్నావు. ఆ మాటలను ఇప్పుడు నీవు భావించి చూడాలి. నిన్ను తప్ప వేరు గతి లేని దాసుని కూడా ఈ స్థితిలోకి నీవే తీసుకుని వచ్చి, రక్షించాలి.

*42) పద్మామహీప్రభృతిభిః పరిభుక్తభూమ్నః*
*కా హానిరత్ర మయి భోక్తరి తే భవిత్రీ।*
*దుష్యేత్ కిమంఘ్రితటినీ తవ దేవసేవ్యా*
*దుర్వారతర్షచపలేన శునావలీఢా॥*

లక్ష్మీదేవి, భూదేవి మొదలైనవారిచే అనుభవింపబడే గొప్పతనాన్ని కల నిన్ను నేను అనుభవించడంవల్ల ఏమి హాని కల్గుతుంది? దేవతల

ఉపయోగానికి తగినది, నీ చరణాలనుండి పుట్టినది అయిన గంగాజలాన్ని తట్టుకోలేని దాహాన్ని కల కుక్క ఆశగా తాగినంతమాత్రంలో ఆ గంగ చెడిపోతుందా ఏమి?

దీపప్రకాశస్వామీ! నీ స్వరూపం, రూపం, గుణాలు మొదలైనవాటిని లక్ష్మీదేవి, భూదేవి మొదలైన నీ దివ్యపత్నులు చక్కగా అనుభవిస్తున్నారు. వాటిని నీచుడనైన నేను అనుభవిస్తే దానివల్ల నీకు ఏమి నష్టం వస్తుంది? నీ గొప్పతనం దానివల్ల తగ్గిపోతుందా ఏమి? ఉదాహరణకు, నీ శ్రీచరణంనుండి అవతరించిన గంగానదిని బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలు గొప్పగా భావిస్తున్నారు, అయితే, ఒక కుక్క తనకు ఉండే తీరని దాహాన్ని తీర్చుకోవడం కోసం ఆ గంగా నదిలోని నీటిని నాలుకతో నాకి తాగితే, దానివల్ల ఆ గంగలోని నీరు చెడిపోతుందా ఏమి? ఆ విధంగానే, నీచుడనీన నేను నిన్ను అనుభవిస్తే, నీకు ఏ విధమైన లోపం కలుగదు సుమా!

*43) సత్త్వాని నాథ! వివిధాన్యభిసంజిఘృక్షోః*
*సంసారనాట్యరసికస్య తవాస్తు తృప్త్యై।*
*ప్రత్యక్షరాజ్మఖమతే రసమీక్ష్య కర్తుః*
*ప్రాచీనసజ్జనవిడంబనభూమికా మే॥*

స్వామీ! ఆత్మను సన్మార్గంనుండి విముఖం చేసే బుద్ధిని కలవాడనై, పనులను చేసేవాడనైన నేను పూర్వులైన పెద్దలను అనుసరిస్తున్నట్లు చేసే నటన, పలువురు జీవులను వారికి ఎదురుగా వచ్చి పట్టుకోవాలని

ప్రయత్నిస్తూ, సంసారమనే నాట్యంలో ఆసక్తిని కల నీకు ఆనందాన్ని కల్గిస్తుంది.

దీపప్రకాశస్వామీ! నీవు అనేక విధాలయిన ప్రాణులను వారికి అభిముఖంగా వచ్చి, వారిని పట్టుకోవాలని తలచి ప్రయత్నం చేస్తున్నావు. అందుకోసం ఈ సంసార మండలంలో ప్రాణులకు అనేక విధాలైన జన్మలను ఇస్తున్నావు. ఆ జన్మలలో వారు పలు విధాలయిన కార్యాలను చేసేటట్లు నీవే చేస్తున్నావు. ఆ జీవులు కూడా, ఈ విధంగా సంసార మండలంలో చిక్కుకొని, తమ కర్మలకు తగినట్లు అనేక విధాలుగా కార్యాలను చేయడం ఒక నటుడు నాట్యమాడడం వలె ఉన్నది. ఈనాట్యాన్ని చూచి నీవు ఆనందిస్తున్నావు. దాసుడైన నేను నా ఆత్మ ఉజ్జీవించడానికి కావలసిన మార్గాన్ని చింతించకుండా, దానిని బహిష్కరించాను. తరువాత కలిగే దుష్పరిణామాలను విచారించకుండా, తోచినట్లుగా కార్యాలను చేశాను. ఆ విధమైన కార్యాలలో పూర్వవులైన సజ్జనులవలె వేషాన్ని వేసుకొని, మాట్లాడి, వారి వలెనే ప్రవర్తన చేయడం కూడా ఒకటి. సంసార మండలంలో వర్తించడం అనే నటనలో రాసిక్యాన్ని కలిగిన నీకు ఈ దాసుని ఈ నటన నీ మనస్సుకు ఆనందాన్ని కలిగించాలి.

*44) కర్తవ్య మిత్యనుకలం కలయామ్యకృత్యం*
*స్వామి న్న కృత్యమితి కృత్యమపి త్యజామి।*
*అన్యద్వ్యతిక్రమణజాత మనంతమర్థ–*
*స్థానే దయా భవతు తే మయి సార్వభౌమీ॥*

స్వామీ! చేయదగనివానిని "చేయదగినవి" అని తలచి, వానిని ప్రతిక్షణం చేస్తున్నాను. చేయవలసినవానిని "చేయకూడనివి "అని తలచి వాటిని విడచిపెడుతున్నాను, ఇంతేకాక, నేను చేసిన అతిక్రమణలు అంతు లేనివి, చక్రవర్తిని అయిన నీ కరుణ నా విషయంలో ఫలాన్ని ఇచ్చే ఉపాయ స్థానంలో నిలవాలి.

దీపప్రకాశస్వామీ! శాస్త్రాలలో చేయకూడనివి అని నిషేధింపబడిన కార్యాలను నేను తప్పకుండా చేయవలసిన కార్యాలని భావించి, ప్రతి క్షణం వాటిని చేస్తున్నాను. తప్పక చేయవలసినవిగా శాస్త్రాలలో విధింపబడ్డవానిని చేయకూడనివి అని భావించి, నిత్యం విడచి పెడుతున్నాను. ఇంత మాత్రమేనా? ఇంకా నేనుచేసే అతిక్రమణలు అంతులేనివి. ఈ స్థితిలో దాసుని రక్షించేవారు ఎవరు? నీకు ఉండే గుణాలు అంతు లేనివి. నా కార్యాలకు ఫలం ఇవ్వడానికి నీ వీర్యం, శక్తి మొదలైన గుణాలను సహాయంగా చేసుకుంటే, నా స్థితి అధోగతి అవుతుంది. సందేహం లేదు. నీ గుణాలలో చక్రవర్తినియై నిలిచే, చేతనుల మంచిని మాత్రమే అన్వేషించే నీ కరుణాగుణం దాసునకు చక్కని ప్రయోజనాన్ని ఇచ్చే ఉపాయస్థానంలో నిలవాలి. ఆ విధంగానే అయినప్పుడే నేను తరించడానికి వీలవుతుంది.

*45) యం పూర్వమాశ్రితజనేషు భవాన్యథావత్*
*ధర్మం పరం ప్రణిజగౌ స్వయ మానృశంస్యమ్।*
*సంస్మారితస్త్వమసి తస్య శరణ్యభావాత్*
*నాథ!త్వదాత్తసమయా నను మాదృశార్థమ్॥*

స్వామీ! పూర్వం నీవు శరణాగతి చేసిన వారివిషయంలో కరుణ చూపడం అనేది గొప్ప ధర్మమని అన్నావో, ఆ ధర్మాన్ని. స్మరింపజేసేవాడవై ఉన్నావు. రక్షకుడవై ఉన్నందున నీవు చేసిన ప్రతిజ్ఞలన్నీ నావంటివారికోసమేకదా!

దీపప్రకాశస్వామీ! భక్తుల విషయంలో కరుణను చూపించడమే నీకు గొప్ప ధర్మం. ఈ వాస్తవాన్ని నీవు నీ నోటితోనే పూర్వం శ్రీరామవతారంలో వ్యక్తం చేశావు. ఆ ధర్మాన్ని ఇప్పుడు నీకు గుర్తు చేసి, నా పట్ల కరుణను కలిగి ఉండేటట్లు ప్రార్థిస్తున్నాను. నీవు అందరికీ రక్షకుడువై ఉన్నావు. భక్తుల కోసం నీవు పలికే నమ్మకాన్ని కలిగించే మాటలు అన్నీ దాసునివంటి ీనీచుల నీచ స్థితిలో ఉండేవారికోసం ఏర్పడినవే కదా. అందుచేత, నీవు పలికిన అభయవాక్యాన్ని నా విషయంలో కూడా సఫలం కావాలి.

*46) త్రాణం భవేతి సకృదుక్తిసముద్యతానాం*
*తైస్తై రసహ్యావృజినై రుదరంభరి స్తే।*
*సత్యాపితా శతమఖాత్మజశంకరాదౌ*
*నాథ! క్షమా న ఖలు జంతుషు మద్వివర్జమ్॥*

"స్వామీ!నీవు నాకు రక్షకుడవు కావాలి" అని ఒక సారి పల్కినవారు పూర్వం చేసిన ఆ యా భరించరాని పాపాలతో తన కడుపును నింపుకొనేది, ఇంద్రుని కుమారుడైన కాకాసురుడు, శివుడు మొదలైనవారి విషయంలో నిజమని నిరూపింపబడినది అయిన నీ క్షమ నన్ను మాత్రం వదలదుకదా!

దీపప్రకాశస్వామీ! చేతనులు సహించరాని పలు విధాలయిన పాపాలను చేస్తున్నారు. వారు మంచి జ్ఞానాన్ని పొంది, " నీవు మమ్ములను రక్షించాలి" అని ప్రార్థించి, నీ శ్రీచరణాలలో ఒకసారి ప్రపత్తిని చేస్తున్నారు. నీ క్షమా వారి పాపాలను అన్నిటిని మింగి తన కడుపును నింపుకుంటున్నది. దానివల్ల వారు పవిత్రతను పొందుతున్నారు. నీకు కల ఈ క్షమాగుణం వాస్తవమైనది అనేది లక్ష్మీదేవి విషయంలో గొప్ప చేసిన కాకాసురుని నీవు రక్షించినందున చక్కగా తెలుస్తున్నది. బాణాసురునితో చేసిన యుద్ధంలో అపచారపడిన శివుని విషయంలో నీవు నీ క్షమను చూపించడంవల్ల, ఇంకా అనేక విధాలయిన వృత్తాంతాల వల్ల నీ క్షమాగుణం అన్ని పాపాలను నశింప చేస్తుంది –అనేది చక్కగా తెలుస్తున్నది. ఈ విధంగా అందరూ ప్రాణుల విషయంలో ప్రవర్తింపజేసే నీ క్షమాగుణం నా విషయంలో మాత్రం ప్రవర్తించకుండా ఉంటుందా? అందుచేత, నీ క్షమాగుణాన్ని నా విషయంలో కూడా చూపించి, నన్ను రక్షించాలి.

*47) కర్మాదిషు త్రిషు కథాం కథ మప్యజానన్*
*కామాదిమేదురతయా కలుషప్రవృత్తిః।*
*సాకేతసంభవచరాచరజంతునీత్యా*
*వీక్ష్య ప్రభో!విషయవాసితయా ౨ ప్యహం తే॥*

భగవన్!కర్మయోగం మొదలైన మూడు ఉపాయాలనుగూర్చి ఏ మాత్రం తెలియనివాడను, విపరీతమైన ఆశవల్ల చెడ్డ ప్రవర్తనను కలవాడను

అయిన నన్ను అయోధ్యలో పుట్టిన చరాచరప్రాణులనువలె నీ దివ్యదేశంలో నివసించగలిగేటట్లు అయినా కటాక్షించాలి.

దీపప్రకాశస్వామీ! దాసుడు కర్మయోగం, జ్ఞానయోగం భక్తియోగం, అనే మూడు ఉపాయాలన ఆచరించడానికి కొంచెం కూడా జ్ఞానం లేనివాడను. ఆశ, కోపం మొదలైన దుర్గుణాలు నిండుగా ఉన్నందున, నీచమైన కార్యాలను చేయడంలోనే ప్రయత్నిస్తున్నాను. అటువంటి నన్ను ఏ కారణాన్ని పురస్కరించుకుని రక్షిస్తావు? నీవు శ్రీరామావతారంలో అవతారకృత్యాన్ని పూర్తి చేసి, నీవు పరమపదానికి వెళ్లేటప్పుడు, అక్కడ ఉండే స్థావర జంగమ వస్తువులకు అన్నిటికి సద్గతిని కలిగించి రక్షించావు కదా. నీ నగరమైన అయోధ్యలో అవి నివసించడమే కారణంగా చేసుకొనే కదా, వాటిని మంచిగతిని పొందించావు. ఆ విధంగానే నీవు అభిమానించి వేంచేసి ఉండే దివ్యదేశంలో నేను నివసించడాన్ని మనసులో పెట్టుకొని, నీవు నన్ను చల్లగా కటాక్షించి, మంచి గతిని పొందించి, రక్షించాలి.

*48) బ్రహ్మాండలగ్న శతకోటిగణానసంతాన్*
*ఏకక్షణే విపరివర్త్య విలజ్జమానమ్।*
*మత్పాపరాశిమథనే మధుదర్పహంత్రీం*
*శక్తిం నియుంక్ష్వ శరణాగతవత్సల!త్వమ్॥*

నిన్ను శరణు పొందినవారిపట్ల వాత్సల్యాన్ని కల స్వామీ! లెక్కలేనన్ని బ్రహ్మాండాలను ఒక్క క్షణంలోనే తలక్రిందుగా మార్చి(నశింజేసి)

నా, అప్పటికీ తృప్తి చెందక సిగ్గుపడే, మధువనే అసురుని గర్వాన్ని అణచిన, నీ శక్తిని నా పాపసమూహాన్ని పోగొట్టడంలో ఉపయోగించు.

దీపప్రకాశస్వామి!నీ శక్తి మధు అనే అసురుని గర్వాన్ని అణచివేసింది. మహాప్రళయంలో ఆ శక్తి కోట్ల కోట్ల సంఖ్యలో అంతు లేని బ్రహ్మాండాలను ఒకే క్షణకాలంలో తలకిందులుగా మార్చగలిగిన సామర్థ్యాన్ని కలిగినది. ఇంత మాత్రమేనా! అని, ఇంత మాత్రమే చేసి, తన గొప్పతనానికి తగిన కార్యాన్ని చేయకుండా, చాలా చిన్న కార్యాన్ని చేసినట్లుగా తలచి, అది చాలా సిగ్గుపడుతున్నది. ఆ శక్తిని, పర్వతాలు పర్వతాలుగా చేసిపెట్టుకున్న నా పాపాన్ని పోగొట్టేటట్లు నీవు ప్రయోగించాలి. బ్రహ్మాండాల కంటే చాలా పెద్దదై ఉండే మా పాపరాశిని నశింప చేయడం వల్ల నీ శక్తికి కలిగిన సిగ్గు తొలగిపోతుంది. అందుచేత శరణు పొందినవారి విషయంలో ప్రేమను కలవాడవు అయిన నీవు నా పాపాన్ని, నీ శక్తి అనే గుణాన్ని ఉపయోగించి, లేకుండా నశింప చేయాలి.

*49) ఆస్తాం ప్రపత్తి రిహ దేశికసాక్షికా మే*
*సిద్ధా తదుక్తి రనఘా త్వదవేక్షితార్థా।*
*న్యస్తస్య పూర్వనిపుణైః త్వయి నన్విదానీం*
*పూర్ణే ముకుంద ! పునరుక్త ఉపాయ ఏషః।*

ముకుందా! పాపాలను పోగొట్టే విషయంలో ఆచార్యుల సాక్షిగా చేయబడే స్వనిష్ఠ అనే ప్రపత్తి ఉండనీ! దానిని జ్ఞానాన్ని, శక్తిని పూర్తిగా కలవాడుకదా చేయగలడు! ఈ విధంగా పూర్ణజ్ఞానాన్ని లేనివాడు

సాధారణమైన జ్ఞానంతో చేసే ప్రపత్తి అనే ఉక్తినిష్ఠ. ప్రపత్తిమంత్రాన్ని ఆచార్యుడు ఉచ్చరించగా దానిని తిరిగి ఉచ్చరించడంద్వారా ఇది సిద్ధిస్తుంది. ఇదికూడా గొప్ప ఉపాయమే. ఈ మంత్రం పూర్ణమైన ప్రపత్తిని అర్థంగా కల్గి ఉన్నదని నేను తెలియకపోయినా, అది నీకు తెలుసుకదా! మహనీయులైన ఆచార్యులచే నేను నీ సన్నిధిలో రక్ష్యవస్తువుగా సమర్పింపబడ్డాను. అందువల్ల నేను ఆచార్యనిష్ఠను కూడా ఉపాయంగా కలవాడను అయ్యాను. కనుక మిగిలిన స్వనిష్ఠ అనే ప్రపత్తి పునరుక్తి అవుతుంది. ఏదో ఒక విధమైన ప్రపత్తిని ఆచరిస్తే చాలుకదా! అందుచేత నన్ను నీవు తప్పక రక్షించాలి.

దీపప్రకాశస్వామీ! నీవు దాసుని చూచి, " నీ పాపాలను పోగొట్టి రక్షించాలి– అని కోరుతున్నావు. వాటిని పోగొట్టడానికి తగిన ఉపాయాలు అయిన స్వనిష్ఠ, ఉక్తినిష్ఠ, ఆచార్యనిష్ఠ అని మూడు ఉన్నాయి. కదా వాటిలో దేనినైనా ఒక ఉపాయాన్ని నీవు చేసావా?" అని అడుగుతున్నావా! అయితే, సమాధానం చెబుతున్నాను, విను. స్వనిష్ఠ అనేది వాటిని చేసే క్రమం మొదలైనవానిని ఆచార్యుని ఉపదేశంచేత చక్కగా తెలుసుకొని, జ్ఞానం, శక్తి అనే వీటిని పరిపూర్ణంగా కలవాడుకదా చేయాలి. అది ఉండనీ. ఆ విధంగా పరిపూర్ణజ్ఞానం, శక్తి లేనివాడు సాధారణమైన జ్ఞానంతో ఆచరించే ప్రపత్తి ఉక్తినిష్ఠ అవుతున్నది. ప్రపత్తిమంత్రాన్ని ఆచార్యుడు ఉచ్చరించగా, ఆ మంత్రాన్ని శిష్యుడు అనుసరించి ఉచ్చరించడం వల్ల ఈ ప్రపత్తి చక్కగా నెరవేరుతున్నది. ఇదికూడా ఏ దోషం లేని గొప్ప ఉపాయమై ఉన్నది. ఈ మంత్రం పరిపూర్ణమైన ప్రపత్తిని విషయంగా కలిగి ఉండడాన్ని దాసుడు

చక్కగా తెలియకపోయినా, నీవు తెలిసికొన్నావుకదా. నేనైతే, పూర్వాచార్యుల ద్వారా నీ సన్నిధిలో రక్షింపబడవలసినవాడనుగా సమర్పింపబడినవాడను. కనుక, ఆచార్యనిష్ఠను ఉపాయంగా కలిగినవాడను అయ్యాను. అందుచేత దాసునకు మిగిలిన ప్రపత్తి ప్రకారం అంతా అధికమై అవుతుందికదా. ఏదైనా ఒక దానినికదా ఉపాయంగా చేసుకోవచ్చు. కనుక, నేను కూడా ప్రపత్తిని చేసినవాడను అయ్యాను. అందుచేత నన్ను నీవు రక్షించాలి.

50) *యద్వా మదర్థపరిచింతనయా తవాలం*
*సంజ్ఞాం ప్రపన్న ఇతి సాహసికో బిభర్మి ।*
*ఏవం స్థితే త్వదపవాదనివృత్తయే మాం*
*పాత్రీకురుష్వ భగవన్!భవతః కృపాయాః ॥*

భగవన్! ఇతడు ప్రపత్తి చేశాడా ?లేదా? అనే నన్నుగూర్చిన విచారణ నీకు ఎందుకులే! నేను చాలా సాహసంగా ప్రపన్నుడననే పేరును పెట్టుకొన్నాను. అందువల్ల నీకు లోకంలో ప్రపన్నుని రక్షించలేదనే అపకీర్తి రాకుండా ఉండడంకోసం అయినా నీవు నన్ను రక్షించాలిసుమా!

దీపప్రకాశస్వామీ! ఇంకొక విషయాన్ని చెబుతున్నాను, విను. ఇతడు సరియైన మార్గంలో ప్రపత్తి చేశాడా? లేదా? అనుగ్రహాన్ని పొందడానికి తగిన యోగ్యతను కలవాడా? లేదా? అనే క్రమంలో నన్నుగూర్చి నీవు విచారణ చేయవద్దు. దాసుడైన నేను ప్రపన్నుడను అనే పేరును కలిగి ఉన్నాను. దీనిని భావిస్తేనే, నన్ను రక్షించవలసిన బాధ్యత నీకు ఉన్నది. నాపై నీవు కరుణ

చూపించకపోతే, "ప్రపన్నుడను అనే భావన చేసినవానిని కూడా చేయి విడువను" అని పూర్వం నీవు పలికిన వాక్కును మీరినవాడవు– అని లోకంలో నింద నీకు ఏర్పడుతుంది. దానిని భావించి అయినా, నా విషయంలో నీవు అనుగ్రహాన్ని చూపించాలి.

*51) త్యాగే గుణేశ!శరణాగతసంజ్ఞినో మే*
*స్త్యానాగసో ఽ పి సహసైవ పరిగ్రహే వా।*
*కిం నామ కుత్ర భవతీతి కృపాదిభి స్తే*
*గూఢం నిరూపయ గుణేతరతారతమ్యమ్॥*

సత్త్వాది గుణాలకు ప్రభూ! నేను చాలా అపరాధాలను చేసినవాడను. అయినా, శరణాగతి చేసినవాడననే పేరును కల నన్ను విడువడంలో కాని, వెంటనే స్వీకరించడంలో కాని నీకు ఏమి ప్రయోజనం వస్తుంది?–అనే మంచి చెడ్డలలోని హెచ్చు తగ్గులను కరుణతో రహస్యంగా ఆలోచించి చూడు.

దీప ప్రకాశస్వామీ! నేను మిక్కిలి పాపాలను చేసినవాడను, అయినా, శరణు పొందినవాడను అనే పేరును కలిగినవాడను అయ్యాను. నన్ను నీవు చేయి విడవడం సాధ్యం అవుతుంది. అయితే, వీటివల్ల నీకు వచ్చే మంచి చెడ్డలు ఎటువంటివి ?అనే విషయాన్ని నీవు ఆలోచించి చూడాలి కదా. కరుణమొదలైన సకల కళ్యాణ గుణాలు నీ దగ్గర నిండుగా ఉన్నాయి. వాటిని అన్నిటితో రహస్యంగా "నన్ను చేయి విడవడం మంచిదా? చెడ్డదా? నన్ను పరిగ్రహించడం మంచిదా? చెడ్డదా? నన్ను చేయి విడవడంచేత వచ్చే మంచి

చెడ్డలు అధికమా? గ్రహించడం వల్ల ఏర్పడేవి అధికమా?— అని ఈ విధంగా ఈ విషయాలను అన్నిటిని ఆలోచించి చూడు.

*52) స్వామీ దయాజలనిధిః మధురః క్షమావాన్*
*శీలాధికః శ్రితవశః శుచి రత్యుదారః।*
*ఏతాని హాతు మనఘో న కిలార్హసి త్వం*
*విఖ్యాతిమంతి బిరుదాని మయా సహైవ॥*

స్వామి, దయకు సముద్రంవంటివాడవు, భోగ్యమైనవాడవు, ఓర్పును కలవాడవు, గొప్ప శీలాన్ని కలవాడవు, భక్తుల అధీనంలో ఉండేవాడవు, పరిశుద్ధుడవు, గొప్ప ఔదార్యాన్ని కలవాడవు, దోషం లేనివాడవు —అనే ప్రసిద్ధి చెందిన నీకు కల ఈ బిరుదులను నీవు నన్ను రక్షించక పోవడంద్వారా కోల్పోవడం నీకు తగినది కాదు.

దీపప్రకాశస్వామీ! చాలా బిరుదులతో నిన్ను లోకం పొగడుతున్నది, అది ఏవి? అంటే, చేతనా చేతనాలను అన్నిటిని నీ సొత్తుగా కలిగినవాడవు, కరుణాసముద్రుడవు, అనుభవించడానికి మధురమైనవాడవు, ఎంతటి దోషం చేసినప్పటికీ దానిని సహించే స్వభావాన్ని కలిగినవాడవు, తక్కువవారితో ఏ విధమైన తేడా లేకుండా వర్తించే స్వభావం కలిగినవాడవు, భక్తులకు వశమై ఉండేవాడవు, ప్రత్యుపకారాన్ని ఎదురుచూడని పవిత్రుడవు, భక్తులకు అన్నిటినీ ఇచ్చినప్పటికి, తృప్తి పొందని గొప్ప ఔదార్యాన్ని కలవాడవు, ఏ విధమైన దోషం లేనివాడవు —అనేవి ఆ బిరుదులు. నన్ను ఇప్పుడు నీవు చేయి విడిస్తే, నన్ను పోగొట్టుకోవడమే కాక, నావల్ల ఇన్ని

బిరుదులను నీవు పోగొట్టుకోవలసి వస్తుంది. అందుచేత, నాపై నీ దయను చూపించి, ఈ బిరుదులను నీవు రక్షించుకో

*53) వేలాధనంజయరథాదిషు వాచికైః స్వైః*
*ఆఘోషితా మఖిలజంతుశరణ్యతాం తే।*
*జానన్ దశాననశతాదధికాగసోఽ పి*
*పశ్యామి దత్త మభయం స్వకృతే త్వయా మే॥.*

దక్షిణసముద్రతీరం, అర్జునుని రథం మొదలైన చోట్ల నీవు పల్కిన మాటలవల్ల నీవు అందరికి రక్షకుడవనే విషయం బాగా స్పష్టమైనది. దానిని తెలిసికొన్నాను. అందువల్ల,. నూరుమంది రావణుల కంటే ఎక్కువ పాపాలను నేను చేసినా, నీవు పల్కిన ఆ మాటలను నిలుపుకోవడంకోసమైనా నన్ను నీవు తప్పక రక్షిస్తావని భావిస్తున్నాను.

దీపప్రకాశస్వామీ! ప్రాణులందరికీ నీవే రక్షకుడవై ఉన్నావని పలుమార్లు నీవే పలికావు. శ్రీరామావతారంలో సముద్రతీరంలో విభీషణుడు శరణు పొందినప్పుడు ఈ భావాన్ని నీవు వ్యక్తం చేశావు. శ్రీకృష్ణావతారంలో అర్జునుని రథంలో సారథివై ఉండి, గీతాశాస్త్రం ద్వారా దీనిని నీ నోటితోనే పలికావు. వరాహావతారంలో భూదేవి వద్ద ఈ అభిప్రాయాన్ని తెలియజేశావు. ఇంకా పలు సందర్భాలలో ఈ విధంగానే అందరికీ అభయాన్ని ఇచ్చి రక్షిస్తానని నీవు నీ నోటితోనే పలికి చాటింపు వేశావు. ఈ విషయాన్ని నేను బాగా తెలుసుకున్నాను. నేను ఎటువంటివాడను? నూరుమంది రావణుల అపరాధాలను కలిపి చూసినప్పటికీ, వాటికంటే

కూడా అధికమైన అపరాధాలను చేసినవాడను. అయితే ఏమి? నీవు పలు విధాలలో అందరికీ అభయాన్ని ఇవ్వడాన్ని నేను బాగా గ్రహించాను. అందుచేత నాకు నీవు తప్పక అభయం ఇచ్చి కాపాడుతావని భావిస్తున్నాను. అందుచేత, నన్ను కూడా ఏ విధంగా అయినా రక్షిస్తావు అనే నిశ్చయాన్ని కలిగి ఉన్నాను. నీ మాట వ్యర్థం కాకుండా ఉండాలి కనుక, నన్ను ఉజ్జీవింపజేయడం ద్వారా వచ్చే ప్రయోజనం నీకే చేరుతుంది కనుక, నన్ను నీవు రక్షించి తీరాలి కదా.

*54) రక్ష్యస్త్వయాతవభరోస్మ్యహమిత్యపూర్వాన్*
*వర్ణానిమానహృదయానపి వాచయిత్వా।*
*మద్దోషనిర్జితగుణో మహిషీసమక్షం*
*మా భూస్త్వదన్య ఇవ మోఘపరిశ్రమస్త్వమ్॥*

"నేను నీచే రక్షింపదగినవాడను, నన్ను రక్షించే బాధ్యత నీదే"—అని ఇంతకు ముందు చెప్పని మాటలను, మనఃపూర్వకంగా కాకపోయినా, నాచే పల్కించావు. నీవు నన్ను రక్షించకపోతే, నా దోషాలచే జయింపబడిన గుణాలను కలవాడవై పోతావు లక్ష్మీసమక్షంలోనే నీవు అందరివంటివాడవై పోతావు. అందుకోసం అయినా నీవు నన్ను రక్షించాలి.

దీపప్రకాశస్వామీ! నేను నీకు రక్షింపబడవలసినవాడను అయ్యాను. నన్ను రక్షించడం నీ బాధ్యత అని నీ వద్ద నేను మాటలను పలకడాన్ని కూడా నీవే చేయించావు. ఈ మాటలను ఇంతకుముందే నేను చెప్పి ఉండకూడదా? అది కూడా చేయలేదు. ఇప్పుడే కొత్తగా చెబుతున్నాను. వీటిని కూడా మనః

పూర్వకంగా చెబుతున్నాను అనేది అయినా ఉన్నదా? అది కూడా లేదు. కపటంగానే చెబుతున్నాను. ఇంత మాత్రంకూడా నీవే నా చేత చేయించినందున, ఇక నన్ను ఏ విధంగా అయినా రక్షించవలసినది నీ బాధ్యత అయినది. ఈ విధంగా కాకుండా, ఒకసారి నీ కొరకు నీ కరుణ మొదలైన గుణాలను నియంత్రించి, నేను చేసిన దోషాలను గమనించడం కూడా నీవు చేయవచ్చు. నన్ను ఆ విధంగా చూచి, నన్ను నీవు చేయి విడిస్తే, నీవు నా విషయంలో ఇంతవరకు చేసిన ప్రయాస అంతా వ్యర్థమైపోతుంది. లక్ష్మీదేవి కూడా మొదట గొప్ప ప్రయత్నం చేసి, నన్ను చివరిలో చేయి విడిచిన నిన్ను సాధారణ మానవునిగానే భావించి, నవ్వుతుంది సుమా. దానికి నీవు అవకాశం ఇవ్వకుండా ఉండడం కోసం అయినా నన్ను రక్షించి, అనుగ్రహించాలి.

*55) ముఖ్యం చ యత్నప్రపదన స్వయమేవ సాధ్యం*
*దాతవ్య మీశ! కృపయా తదపి త్వయైవ।*
*తన్మే భవచ్ఛరణ సంగవతీ మవస్థాం*
*పశ్యన్నుపాయఫలయో రుచితం విధేయాః।*

స్వామీ! జీవుడు స్వయంగా చేయవలసిన, పరిపూర్ణమైన ప్రపత్తికూడా నీ కరుణవల్లనే సిద్ధిస్తుంది. అందుచేత నీ చరణాలను ఆశ్రయించిన నా స్థితిని గమనించి, ఉపాయం, ఫలం—అనే ఈ రెండిటిలో నాకు ఏది ఇవ్వడం తగినదో చూచి, దానిని నీవే ఇవ్వాలి.

దీపప్రకాశ స్వామీ! ప్రతి ఒక్కడు మోక్షం పొందడానికి పరిపూర్ణమైన ప్రపత్తిని తానే చేయాలి—అనేది వాస్తవమే. నేను పరిపూర్ణ ప్రపత్తిని

చేయనివాడను అనేది కూడా వాస్తవమే. అయితే, ఇటువంటి ప్రపత్తిని నీవే కదా నీ కరుణతో చేయించాలి. ఇప్పుడు నేను నీ చరణాలలో మిక్కిలి ఆసక్తిని కలిగిన స్థితిని పొందాను. ఈ స్థితిలో ఉండే నాకు ఆవశ్యకమైనదానిని నీవే కదా చేయాలి –అని ఈ స్థితిని నీవు నేరుగా చూచి, ఇప్పుడు నా ప్రపత్తిని పరిపూర్ణ చేయడమా? లేక, చేసిన ప్రపత్తిని పూర్ణమైన ప్రపత్తిగా గ్రహించి, దాని ఫలంగా మోక్షాన్ని ఇచ్చివేయడమా? అనే విషయం ఆలోచించి చూచి, ఉచితమైన దానిని నీవే చేయాలి.

*56) అల్పాస్థిరై రసుఖజై రసుఖావసానైః*
*దుఃఖాన్వితై రనుచితై రభిమానమూలైః।*
*ప్రత్యక్ పరాగనుభవైః పరిఘూర్ణితం మాం*
*త్వయ్యేవ నాథ!చరితార్థయ నిర్వ్యపక్షమ్॥*

స్వామీ!అల్పమైనవి, అస్థిరమైనవి, దుఃఖాలవల్ల ఏర్పడేవి, చివరలో కూడా దుఃఖాలను ఇచ్చేవి, దుఃఖాలతో కూడినవి, స్వరూపానికి తగనివి, తగని అభిమానంవల్ల కలిగేవి అయిన ఆత్మకు, అచేతనానికి చెందిన అనుభవాలతో మిక్కిలిగా నేను బాధపడుతున్నాను. నీవల్లనే సుఖాన్ని పొందగోరిన నన్ను తరింపజేయాలి.

దీపప్రకాశస్వామీ! స్వర్గం మొదలైన లౌకిక సుఖాలను, ఆత్మను అనుభవించడం అనే కైవల్యాన్ని పొందడాన్నిగూర్చి ఆలోచించేటప్పుడు, దీనిని అనుభవించవచ్చునా? లేక, దానిని అనుభవించవచ్చునా? అని

మనస్సు ఒక స్థితిలో నిలువకుండా పరిభ్రమిస్తున్నది. యథార్థమైన స్థితిని ఇప్పుడు నేను తెలుసుకున్నాను. అవి ఏమి? అంటే,

1) స్వర్గాది సుఖాలు నిన్ను అనుభవించే అనుభవంతో పోల్చి చూసినప్పుడు చాలా అల్పమై తోస్తున్నాయి.
2) అవి నిలకడగా ఉండేవి కాదు.
3) వాటిని పొందడానికి శరీరాన్ని, ఇంద్రియాలను ప్రేరేపించే శ్రమ ఉన్నది.
4) అనుభవించడంలోకూడా చివరిలో సుఖం కలుగదు,
5) అనుభవించేటప్పుడు కూడా, పుణ్యం తీరగానే, తిరిగి ఏ జన్మ వస్తుందో? అని ఈ విధంగా చింతనలు కలుగుతాయి. అందుచేత మనసులోని నెమ్మదితో వాటిని అనుభవించడం వీలు కాలేదు.
6) నిన్ను అనుభవించి ఆనందించవలసిన నా స్వరూపానికి తగినది కాదు.
7) ఆ అనుభవం అంతా వాటి అనుభవం "నాకోసమే నేనే అనుభవిస్తున్నాను", అనే విపరీతమైన భావనను కలిగిస్తున్నది.

ఈ విధంగా ఏడు విధాలయిన దోషాలను కలిగినవి, అయిన స్వర్గం మొదలైన లౌకిక సుఖాల అనుభవాలు.

ఆత్మను అనుభవించడం అనే కైవల్యంలోని దుఃఖంచేత ఏర్పడడం, దుఃఖం కలిసి ఉండడం అనే దోషాలు లేకపోయినా, మిగిలిన ఐదు దోషాలు

అందులో కూడా ఉన్నాయి. ఇప్పుడు వాటి దోషాలను తెలుసుకొని, నేను ఇప్పుడు నిన్ను పరిపూర్ణంగా అనుభవించాలని చాలా కోరుతున్నాను. దాసుడనైన నాకు మోక్షానందాన్ని అనుగ్రహించి, నీవు రక్షించాలి.

*57) తత్త్వావబోధశమితప్రతికూలవృత్తిం*
*కైంకర్యలబ్ధకరణత్రయసామరస్యమ్।*
*కృత్వా త్వదన్యవిముఖం కృపయా స్వయం మాం*
*స్ఫాతిం దృశోః ప్రతిలభస్వ జగజ్జనన్యాః॥*

దాసుడనైన నాకు కరుణతో యథార్థజ్ఞానాన్ని కల్గించి, తగని కార్యాలనుండి నన్ను నీవు నివర్తింపజేయాలి. కరణత్రయంలో సామరస్యాన్ని కల్గించి, నేను నిన్ను తప్ప, ఇంకెవ్వరివైపు చూడకుండా ఉండేటట్లు చేయాలి. జగజ్జనని అయిన లక్ష్మీదేవికటాక్షాన్ని దీనివల్ల నీవు పొందగలవు.

దీపప్రకాశస్వామీ! ఆచార్య కటాక్షంచేత తత్త్వాలను గూర్చిన జ్ఞానం నాకు కలిగేటట్లు నీవు చేసి, నన్ను విపరీత కార్యాలు చేయకుండా ఉండేటట్లు నిరోధించాలి. నా మనసు, వాక్కు, శరీరం అనే మూడు కరణాలు నీకు కైంకర్యం ఋజువుగా చేసి, అవి ఐకమత్యాన్ని పొంది నిలిచే రీతిలో అనుగ్రహించాలి. దాసునకు, ఇక నిన్ను తప్ప వేరొక దైవాన్ని అన్వేషించని మనోనిశ్చయన్ని కలిగించి రక్షించాలి. నీవు కరుణతో స్వయంగానే ఈ విధంగా నాకు అనుగ్రహిస్తే, లక్ష్మీదేవి దివ్య కటాక్షాలను నీవు పొందవచ్చు. లోకానికి తల్లి అయిన ఆమె, తన బిడ్డలలో ఒకడనైన నన్ను ఈ విధంగా రక్షించడం చేత, నీ విషయంలో చాలా ఆనందంతో వికసించిన నేత్రాలతో

నిన్ను చల్లగా చూస్తుంది. ఇటువంటి గొప్ప భాగ్యాన్ని నువ్వు కోల్పోవద్దుసుమా.

*58) ఇత్థం స్తుతిప్రభృతయో యది సంమతా స్స్యుః*
*యద్వా ఽపరాధపదవిష్వభిసంవిశంతి ।*
*స్తోకానుకూలకణికావశవర్తిన స్తే*
*ప్రీతిక్షమాప్రసరయో రహ మస్మి లభ్యమ్ ॥*

నేను చేస్తున్న ఇటువంటి స్తోత్రం మొదలైనవి నీకు ఇష్టమైనా కానీ, లేక, అపరాధాలలోకి అవి చేరినా చేరనీ. కాని, భక్తులలోని కొద్దిపాటి ఆనుకూల్యానికి కూడా వశమయే నీ ప్రీతి, క్షమ—అనే గుణాల ప్రసారానికి నేను లక్ష్యం అవుతున్నాను.

దీపప్రకాశస్వామీ! నేను ఈ విధంగా నిన్ను స్తోత్రం చేశాను. నేను చేసే స్తోత్రం, ధ్యానించడం నమస్కరించడం మొదలైనవి నీ మనసుకు సంతోషం కలిగించేవి అవుతున్నాయా? లేక, పరిపూర్ణుడవైన నీకు అల్పమైన నా ఈ కార్యాలు అపచారాలు అవుతున్నాయా? తెలియలేను. అయితే, నీ భక్తులు అల్పమైన పరిమితికి అనుకూలమైన కార్యాన్ని చేసినా, దానికి వశమై నీవు ఉంటావు అనేది లోకం అంతా తెలిసిన విషయం. దానిని భావించే నిన్ను స్తుతించాను. నా ఈ స్తోత్రం నీకు సంతోషం కలిగించేది అయితే, నీ ప్రేమకు లక్ష్యమై, నీ క్షమతో నా పాపాలను పోగొట్టుకుంటాను. అపరాధకోటిలో నా స్తోత్రం చేరినట్టయితే, అప్పుడు కూడా అల్పమైన అవధిలోని నా అనుకూలమైన కార్యంచేత నీ ప్రేమకు, కరుణాసముద్రుడైన నీ

క్షమకు లక్ష్యమై, దానివల్ల ఉజ్జీవిస్తాను. అందుచేత రెండు విధాలుగాను దాసుడు భయపడవలసిన అక్కరలేదు.

*59) స్నేహోపపన్న విషయస్వదశావిశేషాత్*
*భూయ స్తమిస్రశమనీం భువి వేంకటేశః।*
*దివ్యాం స్తుతిం నిరమమీత సతాం నియోగాత్*
*దీపప్రకాశశరణాగతిదీపికాఖ్యామ్॥*

భక్తుల పట్ల స్నేహం(నేయి, ప్రీతి) నిండుగా ఉండేవాడైన, దీపప్రకాశనామాన్ని కల భగవానునిగూర్చి శరణాగతిదీపిక అనే ఈ స్తుతిని వేదాంతదేశికులు పెద్దల ఆజ్ఞానుసారంగా రచించారు. ఆ స్వామియొక్క స్వరూపరూప గుణాదులను తెలిపే ఈ స్తుతి లోకంలోని అజ్ఞానమనే చీకటిని తొలగిస్తుంది.

శ్రీ వేంకటేశులు అనే పేరు కలిగిన వేదాంతాచార్యులు మహాత్ముల ఆజ్ఞ చేత దీపప్రకాశస్వామిని గూర్చిన శరణాగతి దీపిక అనే ఈ అరుదైన స్తోత్రాన్ని రచించారు. ఇందులో, అందరి విషయంలోనూ ప్రేమను కలిగిన ఆ స్వామి యొక్క స్వభావం, స్వరూపం మొదలైనవి అన్నీ చక్కగా వివరింపబడ్డాయి. అందుచేత, ఈ స్తోత్రం లోకంలో ఉండే జనుల అజ్ఞానమనే చీకటిని అంతటినీ పోగొట్టగలిగినది అవుతున్నది.

ఈ శ్లోకంలో భగవానుని దీపంతో పోల్చినందుకు తగినట్లు, దీపానికి సంబంధించిన స్నేహం (నేయి), దశ(వత్తి), విషయ(పాత్ర) అనే పదాలు ప్రయోగింపబడడం విశేషం.

శరణాగతిదీపికా వివరణం సంపూర్ణమ్

***